# రఘునాథరాయలు.



రచయిత:
కాకర్ల వెంకట రామ నరసింహము, M. A., Ph. D.,
ఆంధ్ర విశ్వకళాపరిషత్,
వాల్తేరు.



M. S. R. మూర్తి & కో.,
విశాఖపట్టణము.
1951

 [ Re. 1

# రఘునాథరాయలు.

---:o:---

## ఒకటవ ప్రకరణము.

---:o:---

అది కావేరీనదీ ప్రాంతమునందలి యొకయటవీ ప్రదేశము. క్రీ. శ. 1614 వ సంవత్సరమున నడి వేసంగి నొకనాడు మిట్ట మధ్యాహ్న సమయమున నొక యాశ్వికుఁడా యరణ్యమధ్యమునఁ బ్రయాణ మొనర్చుచుండెను. మధ్యం దినమార్తాండుఁడు రుద్రరూపియై యశేష జంతుసంతానముల సంతపింపఁ జేయుచుండెను. ఆతని ప్రచండ ప్రతాపమున కోర్వఁజాలక యమ్మహాటవి సంచరించు నఖిల ప్రాణిగణమును శీతల తరుచ్ఛాయల నాశ్రయించుచుండెను. కాని యందుఁగూడ పాపము వాని యాశలు ఫలింపవాయెను. ఆతపుచ్ఛాయలుగూడ నయ్యహార్పతి దాడికి వెఱచి యమ్మహోన్నత పాదపమూలముల నణుగారదొడంగెను. ఇట్లప్రతిహత ప్రతాపమున విజృంభించు నయ్యాదిత్యునిఁగూడ మన యాశ్వికుఁడు సరకుగొన్నట్లులేదు. మిట్టపల్లములనక, కంటకశిలా ప్రదేశములనక మహాధాటితోఁ దనయాజానేయము నడాయించుకొనుచు నాతఁడు బోవుచుండెను. తదశ్వ ఖురపుట ఘట్టనముల నాపరిసరమునఁగలగిరిగుహా గహ్వరములు ప్రతిధ్వను లీనుచుండెను. పోవంబోవ నాతఁ డొకయాశ్రమోపాంత భూమిం జేరెను. ప్రశాంత పావనమగు నయ్యాశ్రమమును గాంచినంతనే, మన యాశ్వికుని ముఖమం

డలమును బ్రిసన్న గంభీరమాయెను. అయ్యాశ్రము రామణీయకమాతని నాశ్చర్యచకితుని గావించినది. పచ్చని పట్టుపుట్ట ముల వోలెనొప్పారు పచ్చికబయళ్ళును, గమ్మని తావులీను కుసుమ మంజరులచేఁ జెన్నారునికుంజపుంజములును, బల్లవిత కుసుమిత ఫలిత తరుషండములును, నాతనికి నేత్రపర్వ మొన ర్చెను. ఒకవంక జలజలపారు చిన్ని సెలయేటి యిసుక తిన్నెలు, భాస్వత్కిరణ జాలములో మిల మిల మెఱసిపోవుచుండెను. మెఱుగారు కాటుక కన్నులతో హరిణశాబకములందందు గంతులు వేయుచుఁ దృణాకణముల మునిపంట గొరుకుచుండెను. శుకపిక శారికాసుస్వరంబులు కర్ణపేయముగ వినవచ్చుచుండెను. అంపలి విహంగమ జంతుసంతతులు పరస్పర ద్వేషభావముఁ నుజ్జగించి, యన్యోన్య సాహచర్యముఁ నమందానందము ననుభవించుచుండెను. అయ్యాశ్రమ మాహాత్మ్యమును గాంచినంతనే మన యాత్రికుని హృదయకుహరమున నమేయభక్తిభావ ముద యించెను. అంతట నాతని తురంగమ వేగమును మందగించెను. ఇప్పుడాతని రూపరేఖలు మనకు విస్పష్టముగా గోచరించుచున్నవి. అతఁడు కుందనపుంబసిండి నిగనిగలుగల దేహచ్ఛాయ గలవాఁడు.. ఆజానుబాహుఁడు. సమున్నత విశాలవక్షుఁడు. వెడదలై నల్లకలువలనీను కన్నులును, సువిశాలోన్నత ఫాలనమును, (శ్రీ)కారములు వోలెనింపు సొంపెస లారు కర్ణద్వయముసాతని సత్త్వగరిష్ఠతయు, ధీశాలిత్వమును, గుణాఢ్యత్వభాగ్యశాలిత్వములను వ్యక్తము సేయుచుండెను. సంపెగ పువ్వువంటి యాతని నాసిక, యాతని ముఖమండలమున శోభవింత

యందమును సంపాదించుచుండెను. ఆతని చూచినంతనే యాతఁడొక రాజపుత్త్రుఁడని నిర్ణయింపవచ్చును. కలికితురాయితో, ముత్తియంపుచేరుల యల్లిక బిగితో నొప్పారునాతని యుష్ణీషమును, బంగరుజరీ పసలమించు బురుసాక బాయమును, మెడలో మిలమిల మెఱయుతార హారములును, ఆతడొక మహారాజని వేనోళ్లచాటుచుండెను. ఆతనిప్రాయ మిరువది సంవత్సరములకు మించి యుండదని యాతని చూచినంతనే గ్రహింపవచ్చును. వేయేల ఆరాకుమారుఁడు మహితలావణ్యామన్మథ మన్మథుఁడు.

మందమంద గమనములనాతని యశ్వరాజ మాశ్రమమునఁబ్రవేశించెను. అంతట నాతఁడా తురంగమము నవరోహించి, యద్దాని నొక వృక్షమూలమునఁగట్టి కాలి నడకనే పయనము సాగించినాఁడు. ఇంచుకదవ్వేగినంతనే యాతనికొక పర్ణశాల దృగ్గోచరమైనది. రాకుమారుడా యుటజమ్ముదరికేగి యందు నడయాడునొక బ్రహ్మచారింగాంచి, తనరాకను యోగిపుంగవుల కెఱింగింపుమని కోరినాఁడు. బ్రహ్మచారియు నెలనవ్వుమొగముతో వడివడి లోనికేగి, రాజపుత్త్రుని రాకను యోగికిఁదెలియఁజేసి యాతని యనుజ్ఞఁగొని రాకుమారుని లోనఁబ్రవేశపెట్టెను. యోగిపుంగవుడొక కుశాస్తరణముపైనాసీనుఁడైయుండెను. ఆతని గాంచినంతనే రాకుమారుఁడు భక్తివినమ్రుఁడై సాష్టాంగ నమస్కారము గావించినాఁడు. యోగియు నాశీఃపూర్వకముగ నాతని లేవదీసి యాతడు

సుఖాసీనుడైన పిదప చిఱునవ్వోలయు నెమ్మొగముతో నిట్లు పలుకరించినాఁడు.

"ఓహో! రఘునాథుఁడా! ఎన్నిదినములకుఁజూచి నానునాయనా నిన్ను. ఓహో దినములేమి? కొన్ని సంవత్సర ములే నిజముగా గడచినవి. ఆనాఁడు నేను తంజాపురమునకుఁ దఱచు వచ్చుచుఁ బోవుచుండెడి వాడను. అప్పటికి నీవు చాల పసివాడవు. రెండు మూడేండ్లకి్రితము నిన్నొకమారు బృహ దీశ్వరాలయమునఁ జూచినాను. అ చ్యు త నా య ని ం గా రి క్ సేమమేకదా!"

రఘు:— తమ యాశీర్వాదబలమున సేమముగానే యున్నారు. వారియాజ్ఞానుసారమే నేనీ ప్రాంతమున కేతెం చినాను.

యోగివర్యునిమోమున దృశ్యాదృశ్యముగ నించుక కఠోరతతోఁచి వెంటనే యంతరించినది. ఆతఁడు మగుడ యథా ప్రకారముగనే ప్రసన్నవదనముతో నిట్లు ప్రశ్నించినాఁడు.

ఋషి:— ఏమని వారియాజ్ఞ?

రఘు:— ఈ ప్రాంతమున చోళగుడను నొక దొంగల ఱేడుగలడు. అతఁడు తఱచుగా నీమధ్య, తంజాపురీ రాజ్యము పైఁబడుచు, దోపిడిసేయుచున్నాఁడు; మానవతుల చెఱపట్టు చున్నాఁడు. గోబ్రాహ్మణుల హింసించుచున్నాఁడు. అవాచ్య ములగు ఘోరకృత్యముల గావించు చున్నాడు. వానిహింసల కోర్వలేక ప్రజలందఱు నాయనిగారితో మొఱవెట్టుకున్నారు. ఆదుండగీని దండించి రావలెనని నాయనిగారి శాసనము.

యోగివదనమండలమునఁ గ్రోధకాఠిన్యములొక్క మారు పొడసూపి యంతలోనే యంతరించినవి. కాని యీమారు రఘునాథుని నిశితదృష్టినవి తప్పించుకొనలేక పోయినవి. కాని రఘునాథుఁడా క్రోధకారణమును వేఱుగా నూహించినాఁడు. చోళగుని దౌర్మార్గ్యమే ముని కినుకకుఁగారణమనుకొనినాఁడు. క్షణమాత్రములో మూనియుఁ దేఱుకొని అచ్చెరువందిన వాని వోలె నిట్లుపలికినాఁడు.

ఋషి:— ఏమి? చోళగుడా? ఆపేరైన నెప్పుడు వినలేదే. ఎవ్వఁడా ప్రజాకంటకుఁడు నాయనా! రఘునాథా! నీసాహసమును వేనోళ్ల గొనియాడవలయును. నీ శౌర్యము సర్వజనశ్లాఘ్యము. నీ పితృభక్తి ప్రశంసార్హము. నిక్కముగ రాజద్రోహులు, ప్రజాకంటకులు దండింపదగినవారే. కాని నీవొంటరిగ........

రఘు:— లేదు. నేనొంటరిగ రాలేదు. సేనాసమేత ముగనే వచ్చినాను. ఇచ్చటి కనతిదూరముననే మాసేనలు విడిసియున్నవి. నిన్ననే యొకసన్న్యాసి మా సేనావారమున కేతెంచి, యిందలి తమయునికి నెఱింగించినాఁడు.

ఋషి:— ఏమని చెప్పినాఁడు?

రఘు:— సమీపముననే యొక యాశ్రమము గలద నియు, నందు చిద్ఘనానందులను యోగసిద్ధులు నివసించుచున్నా రనియు వారిని దర్శించుట సకలకార్యసాఫల్య హేతువనియుఁ జెప్పినాఁడు. పూజ్యపూజావ్యతిక్రమమాపదలన్నింటికి నాల

వాలమని యూహించి, తమదర్శనముసేసి, నాజీవితమును ధన్యతమము గావించుకొన నే తెంచితిని.

ఋషి:— అట్లా; సరే—కాని యూచోళగుడెంతటి యసాధ్యుడా? సేనాసమేతముగ నే తెంచితి వనుచున్నావే?

యోగీంద్రుని వదనమునందో చిన మందహాసాంకురమును రఘునాథుడు చూడకపోలేదు. ఆతని హృదయమున భక్తి భావ మించుకయూగిన లాడజొచ్చినది. సంశయాంకురము తలసూపం దొడగినది. కాని యంతలోనే యాతడు సమాధాన పడెను.

రఘు:— సాధ్యుడో? అసాధ్యుడో? నేనిప్పటికెట్టి నిర్ణయమునకును రాలేదు. అతడొక భైరవో పాసకుడట. భైరవుని యనుగ్రహమున దురాపములగు వరములను బడసి యున్నాడట. కాన...

ఋషి:— కాని—నీవు వానిని విశ్వసింపజాలవు. అంతేనా?

రఘు:— ఔను. యోగీంద్రుడొక వెడ నవ్వునవ్వెను. అది విపరీతమగు పయఃపూరమునోలె రఘునాథునకు దోచినది.

ఋషి:— తనబలమును, ఎదిరిబలమును తెలిసికొని ప్రవర్తించుట ప్రాజ్ఞుల లక్షణము; కేవలము తనబలముపైనే యాధారపడి, యెదిరిబలమును సరగుసేయకుండుటయు వీరలక్ష

ణాసే కాని యది సాహసైక మూలమని కొందఱి యభిప్రాయము. నీవు వీరపురుషోచితముగఁ బల్కినపల్కులు మాకానందమును జేకూర్చినవి. కాని వాని యానుపానుపూర్వైనఁ గనుగొంటివా?

రఘు:—— లేదు. ఇప్పటికాతని యునికియే మాకు తెలియదు.

చిద్ఘనానందుల ప్రసంగము రఘునాథునకంతగా రుచింపలేదు. చోళగుని విషయమున నాతఁడేల యంతశ్రద్ధ గైకొనుచుండెనో రామమాయునకర్థము కాలేదు. ఆతఁడించుకసేపు సంశయాకులితమనస్కుఁడైనాఁడు. కాని వెంటనే నింద్యములగునట్టి భావములకుఁ దావొసంగి నందులకై తన్నుదానే నిందించుకొనినాడు, చిద్ఘనానందు లాతనిముఖమువైపొక్కసారి దృష్టి సారించి, యాతని హృదయగతాభిప్రాయమును గ్రహించినవాడు వోలెనించుక తలయూచి, వెడవెడ నవ్వెను. రఘునాథున కరికాలు మంట నెత్తికెక్కినది. కాని తనకోపమును దానే దిగమ్రింగుకొన్నాఁడు. ఇంక నచ్చట దానుండుట తనకుఁ గాసి మహర్షికిగాని యానందదాయకముగాదని యూహించినాఁడు, క్షణములో నాయూహయే బలీయము కాగా, నాసనమునుండి లేచి "స్వామీ! ఇంకనేను సెలవుగైకొందును" అని బద్ధాంజలియైపల్కినాఁడు. కాని యోగి యందులకంగీకరింపలేదు సరికదా యాతనిచేతులు పట్టుకొని కూర్చుండఁజేసినాఁడు. రఘునాథుఁడు యోగిపుంగవుని కరస్పర్శమున నించుక యులికిపడినాఁడు. ఏమి యీచేతుల కఱకుఁదనము? మఱియు యోగి

శారీరక బలమును రఘునాథునాశ్చర్య చకితుని గావించినది. నిరాహారులై యడవుల తపించు జడదారులకింతటి శారీరక బలముండునా? యోగమాహాత్మ్య మట్టిదై యుండునని యాతఁడు సమాధానపడెను. రఘునాథుని సమాధిభావనాపథమునుండి మరలింపుచుఁ జిష్ణునానందుఁడిట్లు పక్రమించెను.

"ఓహో! ఇది యేమి? ఇంతలోనే మరలఁబ్రయాణమా? చాల యెండపడి వచ్చినావు. ఈదినమంతయు నీవిచ్చటనే మా కతిథిగా నుండవలయును; ఇదియాశ్రమోచితమగు మర్యాద."

"మీయవ్యాజకృపకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. కాని నేనీవిషయమున నస్వతంత్రుఁడను. పితృవాక్య పరిపాలనము నా కవశ్యకర్తవ్యము. చోళగ సంహారమగువరకు నెందును మసలరాదని మానాయనగారి యాజ్ఞ. ఇప్పటికే నేను వారియెడ మహాపరాధము గావించినాను. ఇంకనిందుండఁజాలను. క్షమింప వలయును."

"అట్లా! మీనాయనగారి యనుజ్ఞ లేనిచో నిన్నిందుండుమని నేనును బలవంతముసేయను. కాని, వచ్చినవాడవు వచ్చినట్లే మరలిపోవుట పాడికాదు. మా యాతిథ్యమునొకించుకయైనఁ గైకొనవలయును. ఇది సత్పురుష సంప్రదాయము."

రఘునాథుఁడొకించుక యాలోచనలో పడినాడు. అతని మన సేలొకో సంశయగ్రస్తమైనది. ఇట్లాలోచనాధీనమానసుఁడై యున్న రఘునాథునకెట్టయెదుట, శంపాలత వోలె నొక యంగనామణి గోచరించినది. ఆమెను జూచినంతనే యాతఁడా

శ్చర్యచకితుఁడైనాఁడు. యోగీంద్రుఁడామెను జూడలేదు. ఆతని వీపామెవైపు తిరిగియున్నది. యోగికి వెనుకప్రక్క నసతి దూరమున నున్న ద్వారము నానుకొని యామె నిలిచియున్నది. అందామె యూరక నిలచియుండలేదు. హస్తసంజ్ఞచే రఘునాథుని, యోగివర్యు నాతిథ్యమును స్వీకరింపవలదని, హెచ్చరించుచున్నది. వేడుకొనుచున్నది. ఇచ్చట చెప్పినవిషయములన్నియు నరనిముసములో జరిగిపోయినవి. రఘునాథుఁడామె యభిప్రాయమును గ్రహించినాఁడు. ఆమె యెవ్వరైననేమి? ఏకారణముచేతనో తన్నా యాతిథ్యమును స్వీకరింపవలదని యుద్బోధింపుచున్నది. తన చిత్తముగూడ సంశయాకులమే యయియున్నది. కావున నందేమియుఁ గైకొనక పయనము సాగించుటయే యుత్తమమని యాతఁడు నిశ్చయించుకొనినాఁడు. వెంటనే యోగికిట్లు ప్రత్యుత్త మిచ్చినాఁడు.

"స్వామీ! నాయవినయమును మన్నింపుఁడు. ఇప్పుడు నేనిం దేమియు స్వీకరింపఁజాలను. నాకిటువంటి యెండయొక లెక్కలోనిదికాదు. నాశరీరమున నించుకంతయు బడలిక లేదు. నాయనుయాయులు నాకొఱకెదురు సూచుచుందురు. ఇప్పటికే చాలప్రొద్దుపోయినది. నాకనుజ్ఞ యియ్యుఁడు."

యోగిముఖమండలమున గ్రోధకాఠిన్యములు తలసూపినవి. ఆతని ముఖముక్షణకాలముద్దీప్తమైనది. కాని క్షణములోనే యాతఁడు సమాధానపడినాఁడు.

"సరే అట్లేకానిమ్ము. నీయిచ్ఛయే నాయిచ్ఛ. మంచిది. పోయిరమ్ము."

రఘునాథుఁడప్పటికే తన యాసనమునుండి లేచియున్నాఁడు. ఒక్కమాఱాతఁడు ద్వారమువంక దృష్టిసారించెను. కాని యందాతని కామె కానుపింపలేదు. యోగియు నాతనితోడనే లేచినాఁడు. కాని రఘునాథుఁడాతని వారించి, త్వరిత గతి నీవలికివచ్చి, తన తురంగమము నధిరోహించి, పయనము సాగించినాఁడు. ప్రయాణము సేయుచున్నాఁడే కాని యాతనిమనసు మనసులో లేదు. అప్పుడాతని మనస్సులోఁ దాండవింపుచున్న ప్రశ్న యొక్కటే— ఎ వ్వ రా మె?

---

## రెండవ ప్రకరణము.

“ఏమండీ తిమ్మావధానులుగారూ! ఏమంత తొందరగా బోవుచున్నారు. ఎన్నియేండ్లు వచ్చినను మీజవసత్త్వములు మాత్రమట్లే చెక్కుచెదరక నిలిచియున్నవి. మహాదృష్టవంతులు” అని యొకనాటిప్రాతఃకాలమున జంద్రగిరియందలి యొక వీధిలో నొక విప్రునింకొక విప్రుడుపలుకరించినాఁడు. వడిగాఁబోవుచుండియుఁ దిమ్మన యావాక్యముల నాలించినాఁడు. వెంటనే యారెండవబ్రాహ్మణునితో నాతడిట్లు ప్రసంగింప మొదలిడినాఁడు.

“ఓహో బుజ్జావధానులుగారా! పరాకుగా నుండుటచే మిమ్ముసరిగాఁదొలుతనే గుర్తింపలేకపోయినాను. అదృష్టమో? దురదృష్టమో? ఈదినముననే తేలిపోవును కదా”

"ఏమది? విశేషములేమైనఁగలవా?"

"బాగున్నది. విశేషములేమైనఁగలవా? అని యింకను బ్రశ్నింపుచున్నారా? ద్వీపాంతరమునుండి వచ్చినారా యేమి?"

"ఇంచుమించుగ నట్లేయనవచ్చును. ద్వీపాంతరమునుండి కాకున్నను, సీమాంతరమునుండియే వచ్చినాను. ఈమధ్య నేను కాశీ విశ్వనాథుని సేవింపనేగినాను. ఆరునెల లాయె నేనీ చంద్రగిరినివీడి, నేడే మరలి వచ్చినాను."

"అట్లా! అందులకే మీరిట్లు ప్రశ్నించుట. విశేషములన్నవిశేషములా. కొంపలంటుకొను చున్నవి. కాని మనవంటి వారికి మాత్రము కొంతచేయి తడియుగుటకిదే మంచితరుణము."

"ఎట్లెట్లూ? కొంచెము వివరించి చెప్పుడు మీ పున్నెమాయె."

"వివరించుట కేమున్నది. ప్రాతబియ్యముపాటి మానిక. మన [illegible]లు వేంకటపతిరాయులవారు పరమపదించిరి. భూరిదా[illegible] సేయబడునని వినికిడి. ఏమో! వేళకచ్చుటికేగి యు[illegible] నేమైనఁద్రుణమో కణమో ముట్టకపోవునాయని నాయాశ. మీరుకూడ వచ్చుట మంచిది."

"వచ్చుటకు నాకెట్టి యభ్యంతరమును లేదు. ఇట్టిసదవకాశములు మనకు తఱచు లభింపవుకదా! అయినను నన్నొక సందేహము బాధించు చున్నది."

"ఏమది."

"ప్రభువులు వైష్ణవులు కదా! మనము స్మార్తులము. మనకిందేమి లభించును?"

"ఓహో! ఇదియా మీ సందేహము. అవును. మీరీ మధ్యనీ యూర లేరుగా. అందులకే మీకిట్టి ధర్మసందేహములు కలుగుచున్నవి. (ఇంచుకదరికేగి మెల్లగా) ఇందొక పరమరహస్యమిమిడి యున్నది. అది రాజకీయము. ఎవ్వరికి నెఱిగింపనని ప్రమాణము చేసినచో చెప్పెదను."

"ఏమి? రహస్యమా? ప్రమాణములకేమి లెండు? లక్ష చేసెదను. నేనెవ్వరితోడను జెప్పను, చెప్పుటవలన నాకేమి యూడిపడును? వేగమాపరమరహస్య మేమో సెలవిండు."

"వేంకటపతిరాయలవారు తనమరణమునకుఁ బూర్వము రెండు మూఁడు నెలలు రోగపీడితులై యుండిరి. ఒకనాఁడు వారుసచివ సామంతదండనాథాదులఁదన యంతికమునకు రావించి, తనయనంతరము తన యన్నకుమారుఁడు శ్రీరంగరాయులే రాజ్యమునకు రావలయుననియు, దనకుఁబుత్త్రసంతతి లేదనియుఁజెప్పినారఁట."

"(ఆశ్చర్యముతో) అదియేమి? రాయలవారి కేమైన మతిభ్రమణము గల్గినదా? వేంకటాంబ గారికిఁదనయుఁడు గలడుకదా! ఆమెయు రాయలవారి దేవేరులలో నగ్రగణ్యురాలు, ఈవైపరీత్యమేమి? ఆసభ్యులలో నెవ్వరికి నీయంశము స్ఫురింపనేలేదా?"

" స్ఫురింపకపోలేదు. కాని రాయలవారే యందులకు సమాధాన మొసంగియుండిరి."

" ఏమని? "

" వేంకటాంబా గర్భశుక్తి ముక్తాఫలమని మనమందరము భావించు నా బుడుతడు నిజముగా నామె గర్భమున జనించినవాఁడు కాడఁట. ముచ్చటకై వేంకటాంబగారాతనిని బెంచినారఁట. ఆమెమనసు చిన్నబుచ్చుట కిష్టములేక రాయలవారు నాకుఱ్ఱని నట్లే లాలించినారఁట. అన్నకుమారున కన్యాయము జరుగునేమోయని తన మరణావసరమున నారహస్యము సచివ సామంతాదులకుఁ దెలియఁ జేసినారఁట. ఈ రహస్యము రాయలవారికిని వేంకటాంబగారికిని దప్ప మరియెవ్వరికిని దెలియదఁట."

" ఆదాసి యేమైనది?"

" ఆపిల్లవానిని గనిన యనంతరమైదారు రోజులలోనే మరణించినదఁట."

" ఎంతచిత్రమైనగాథ. అయిన నిప్పుడు శ్రీరంగరాయలవారే సింహాసనము నధిరోహింతురన్న మాట."

" అదిగో ఆవిషయమే యిప్పుడు సందేహాస్పదముగానున్నది. ఇప్పుడు రాజాస్థానమున రెండు కక్షలు బయలుదేరినవి."

"అదియేల? రాయలవారే స్వయముగా తనయనంతరము సింహాసనమునధిరోహింప నెవ్వఁడర్హుఁడో నిర్ణయించినారుకదా, ఇంక శంకాతంకములకు తావేది?"

"మీకును నాకును లేకపోవచ్చును. గాని యందుగల సభ్యులే కొందఱామాటలను విశ్వసింపలేదు. మఱియు వేంకటాంబగారి తమ్ముఁడు జగ్గరాజను నాతండొక్కఁడు గలడు. మరణావసరమున రాయలకు మతి భ్రమణముగల్గినదనియు, నందుచే నప్పటియాయన యాజ్ఞయాదరణ యోగ్యముగాదనియు, నాతఁడు ప్రచారముసేయఁదొడఁగెను. అతనిపాట కాతనియక్కగారు తాళమువేయుచున్నది. ఇంతకు మంత్రి సామంతాదులలోఁగూడ భిన్నాభిప్రాయములు గలవని మొదటనే చెప్పినానుకదా."

"రాయలకు మతి భ్రమణమేల కలుగవలెను?"

"శ్రీరంగరాయల పక్షమువారెట్లో రాయలకు మందుపెట్టి మతి విరిచినారని, గొబ్బూరిజగ్గరాజుగారి ప్రచారము."

"పక్షమువారనగా?"

"శ్రీరంగరాయల తల్లియగు తిరుమలాంబ మొదలగువారు"

"రామ! రామ! నేనీమాట విశ్వసింపఁజాలను. తిరుమలాంబగారు మహాసాధ్వి."

" మనము విశ్వసించినను విశ్వసింపకపోయినను మంత్రులు కొందఱామాటలను విశ్వసించిరి. దండనాథులందఱు నించుమించుగా జగ్గరాజు పక్షమువారే,"

" మహామంత్రులీవిషయమున నేమందురు?"

" ఏమందురు? ఇటునటు చెప్పలేక యూరకుందురు?"

" ఇంతటి రహస్యవిషయమున నిజానిజములు తేల్చుట కష్టమే. కాని నిజమునిలకడమీద తేలకపోదు. కాని సామంతులు గూడ జగ్గరాజు మాటలనే విశ్వసించుచున్నారా?"

" ఇంచుమించుగ నందఱును జగ్గరాజు పక్షమే యవలంబించియున్నారు. ఒక్క తంజాపురమువారు మాత్రము శ్రీరంగరాయల పక్షమున నున్నారని వినికిడి."

" ఓహో ధర్మమున కింకను నిలువనీడ కలదన్నమాట. అచ్యుత నాయునింగారు మహాభక్తులనియు, వితరణఖనులనియు వినియున్నాను. నాడు శ్రీకృష్ణరాయలవారికి తిమ్మరుసు వోలె నాయుసారాజునకు రాజనీతి విశారదులలో నగ్రగణ్యులగు గోవింద దీక్షితులవారు మహామంత్రులట"

" అన్నిటికంటె ముఖ్యవిషయమును జెప్పమరచినాను. అచ్యుతనాయునింగారి కుమారుడురఘునాథరాయలు మహాపరాక్రమశాలి. ఆయన అన్నివిషయములలోను అపర శ్రీరామచంద్రుండే. ఆనాఁడు, వేంకటపతిరాయలవారు తనయంత్య సందేశమునిచ్చిననాఁడు, రఘునాథరాయలవారుకూడ వచ్చి

యున్నారు. ఆయన మరణవార్తాలమునాయన స్వయముగా వినియున్నారు. కావుననే తంజాపురమువారు మాత్రము శ్రీరంగ రాయల పక్షమును హరిహరాదు లడ్డమైనను వీడువారుకారు.''

"రఘునాథనాయనింగా రిప్పుడీ యూరనేయున్నారా?''

" లేదు. వారి తండ్రిగారు త్వరగా రమ్మని కబురంపుటచే, సభజరిగిన మరునాడే యీ యూరు విడినారు."

"అంత త్వరగా వారు కబురంపిన కారణము?''

" చోళగుడను నొకమాయావికలడట. వాడొక మహా మాంత్రికుడట. వాడు దొంగల గుంపులకు నాయకుడై, దేశ ముపైబడి దోచుకొను చున్నాడట. మానవతుల పాలిటి సాక్షాన్మృత్యువై యాతడు సంచరించు చున్నాడట. ఈమధ్య తంజాపురములో గూడ గొన్ని యుదంతములు కలిగినవట. వానిని దండింప రఘునాథరాయలవా రేగియున్నారు."

" వారన్నిటసమర్థులు " పదాది క్రితము, గోలుకొండ నబాబుతో వేంకటపతిరాయలవారిసంభవించినమహాయుద్ధమున నయ్యేకైక వీరుడు గావించిన విశృంఖలవీరవిహార మఖిలజన శ్లాఘ్యముకదా! వారికీదొంగలగుంపు లొక లెక్కయా! చీమలవలె నలిగిపోవుదురు."

" అట్లనుకొనరాదు. చోళగునకు రహస్యముగా బుడతకీచులుకూడ సాహాయ్యము సేయుచున్నారట. వారు సముద్ర యాన ప్రవీణులు; చోళగుని నివాసముకూడ దేవికోటయను

నొకద్వీపము. అది కావేరీ సాగర సంగమ ప్రదేశమున కనతి దూరమున, సముద్రాంతర్వర్తియై యున్నది. మఱియుఁబాండ్య తుండీరాధిపతులుగూడ, చోళగునే ప్రోత్సహించు చున్నారట వారికి తంజాపురమువారితో నిత్యవైరముకదా!"

"అట్లయినఁ దంజాపురమువారు శ్రీరంగరాయలపక్ష మవలంబించినారు కావునఁబాండ్యతుండీరాధిపతులు జగ్గరాజు నకు సాహాయ్యము సేయుదురన్నమాటయే."

"ఔను. జగ్గరాజుపక్షమే. అచిరకాలములోనే తుండీరాధిపతియగు కృష్ణభూపతియుఁ బాండ్యనాథుఁడగు ముత్తువీరప్పయు నీనగరమున కేతెంతురని యొక వార్త."

"అయ్యో! అట్టిసమయమున నిచ్చట రఘునాథనాయ నింగారున్న నెంతబాగు. ఇంక శ్రీరంగరాయల పక్షమున నొక్క మాటయైన నాడు వారుండరను కొందును."

"కాదు కాదు. వేంకటపతిరాయలవారి కుడిభుజమును, తంజాపురాధినేత యగు నచ్యుతరాయలవారికి పరమ మిత్రుఁ డును, అగు వెలుగోటి యాచమనాయనింగారు కలరు. వారనిన జగ్గరాజునకు సింహస్వప్నము. పాండ్యతుండీరాధిపతులకాత ని బలపరాక్రమములు క్రొత్తవి కావు."

"అదియెట్లు?"

"ఒకమారు కృష్ణభూపతి సామ్రాజ్యముపై నెదురు తిరిగి కప్పము చెల్లించుట మానినాఁడు. వేంకటపతి

రాయలవారి రాయబారి నవమానించి పంపినాఁడు. అంతట రాయలువారు క్రుద్ధులై యాచమ నాయసింగారిని, ససైన్య ముగ నాతనిపైకి పంపినారు. అప్పుడు పాండ్యతుండీరపలులు లేక మైరి. తంజాపురమువారుమాత్రి మానాడుకూడ సామ్రా జ్యమునకే సాహాయ్యము గావించిరి. అమ్మహాయుద్ధమున యాచమనాయనింగారనుపమాన పరాక్రిమాతిశయమును జూపినారు. కృష్ణభూపతిని చెఱగొని, రాయలవారి సమ్ముఖ మునఁబెట్టిరి. ఆనాటినుండి మొన్న మొన్నటివరకు కృష్ణభూ పతి చెరసాలయందే కాలము గడపెను. మహామ్మదీయుల తోడి యుద్ధమునఁదన విజయములకు మూలకారకుఁడైన రఘు నాథుఁడు కోరగా, రాయలు కృష్ణభూపతిని విముక్తుని గావించెను.

"ఇంత గ్రింథము కలదా! కృష్ణభూపతి యెంతకృత ఘ్నుఁడు. తన్ను చెఱనుండి విడిపించిన తంజాపురమువారి యెడనే ద్రోహము తలపెట్టినాఁడు."

"ఔను. పరిస్థితులన్నియుఁ జాలవిషమముగ నున్నవి. తుదకు పర్యవసానమెట్లుండునో."

"యతోధర్మ స్తతోజయః. పర్యవసానమంతేకాని తిమ్మన గారూ! మరల మొదటకే వచ్చుచున్నాను. మీరు సెలవిచ్చిన యాయుప పత్తులేవియు మనకుగూడ భూరిదానములు లభిం చునను మీవాక్యమును సమర్థింపలేకున్నవే. మాటల సందడిలో నసలువిషయమునే మఱచినట్లున్నారు."

"అయ్యా బుజ్జావధానులుగారూ! రామాయణమంత యువిని రామునకు సీతేమి యగునని ప్రశ్నించినాడఁట! ఇప్పు డుభయపక్షముల వారికిని గావలసినది ప్రజల సదభిప్రాయము. ఇరుపక్షములవారును శ్రాద్ధకర్మ చేయుచున్నారు. మత వివక్షత లేకుండ దానధర్మములు సేయుచున్నారు. కావుననే మనకును గొంత లభింప గలదని మనవి చేసినాను."

"అసాధ్యులండీమీరు, నిజముగా నీయిరుపక్షములలో నెవ్వరైన మిమ్ముఁదమకు మంత్రిగాఁజేసికొనినచో వారిపక్షమే తప్పక విజయవంతము కాగలదని, నేను నొక్కి వక్కాణింపగలను."

"సరి సరి. నేనే మహామంత్రినైనచో నీశ్రాద్ధమున నొక లక్ష దీనారములైనను బ్రతిగ్రహింప కుండునా? ఇంతకు దైవమనుకూలముగా లేదు. త్వరపడుడు. కాలాతి క్రమణమైన చోఁగార్యకలాప మంతయుఁజెడును."

---

## మూడవ ప్రకరణము.

అది తంజాపురీ రాజప్రాసాదమునకు వెనుకనున్న లీలో ద్యానము. వెన్నెలఱేడు తనచల్లని కిరణములచే నిదాఘసంతప్త మగు జీవలోకమున కించుక హాయిని చేకూర్చుచుండెను. అమృత కిరణునకు చేదోడువాదోడుగాననిలకుమారుఁడును బ్రచార ముసేయుచుండెను. పుష్పితతరులతా సంతతులు కమ్మని తావు లీనుచుండెను. ఊరంతయు మాటుమణిగి యుండెను. ఉద్యాన

వనమునఁగూడ, నెల్లయెడల నిశ్శబ్ద వాతావరణమే తాండవించుచుండెను. అప్పుడప్పుడొక పక్షి కన్నువిచ్చిచూచి చంద్రికాధాళధళ్యమును గాంచి, ప్రభాతకాంతి పుంజముగా భ్రమించి, రెక్కలు విదిర్చి, కలకలారావము గావించుచుండెను. ఆప్రశాంతవాతావరణమున కదియొక్కటియే యంతరాయము.

అట్టి ప్రశాంతమనోజ్ఞ ప్రదేశమున, నొక చలువరాతి తిన్నెపై నిరువురు పురుషు లాసీనులై యుండిరి. ఇరువురు నించుమించుగా సమవయస్కులనియే చెప్పవచ్చును. ఇరువురును స్ఫురద్రూపులే. ఇరువురును మనోజ్ఞ వస్త్రాలంకృతులే. ఇరువురును తేజస్సంపన్నులే. స్థూలదృష్టికి వారిరువురు నేకవ్యక్తి యొక్క భిన్నరూపములాయని యనిపింపకపోదు. కాని నిశితముగఁబరిశీలించినచో, వారిరూపురేఖా విలాసములందు సాదృశ్యముకంటె భిన్నత్వమే పరిస్ఫుటము కాగలదు. అందొకనియందు క్షాత్రమగు తేజస్సంపద పుంజీభూతమై యుండెను. ఇంకొకనియందు బ్రాహ్మ్యమగు తేజస్సుట్టిపడుచుండెను. ఒకడు బాలభానుమరీచి జాలములగేరు ముఖవర్చస్సు గలవాడు. ఇంకొకడు చంద్రమః కలా కలాపమును బుగడించు నాననశోభకలవాడు. ఒకడు నిబిడనీల జలదమాలికా సదృశమగు కేశరాశికలవాఁడు. ఇంకొకడు మనోజ్ఞ శిఖామండిత శిరస్కుఁడు. ఒకడమృతమును హాలహాలమును దనగర్భకుహరమున నిముడ్చుకొన్న కలశపాథోరాశి. ఒకడు, శీతలపవిత్రజలః పూరముచే నొప్పుగాంగలహరి. ఒకని కటిప్రదేశమున సాధుజనరక్షాదక్షము నహితజన భయంకరమునగు నాభీలదీర్ఘ కరవాలము వ్రేలాడుచుండెను.

ఇంకొకనివద్ద నట్టి భయంకరాయుధము లేవియు గానరావు. పాఠక మహాశయా! ఆయిరువురు నెవ్వరో గ్రహించితివా? అందు జ్ఞాతృతేజస్సంపదగల యాతఁడే రఘునాథుఁడు. రెండవ యాతఁడాతని ప్రియమిత్రుఁడును, శిష్యుఁడునగు యజ్ఞనారాయణ దీక్షితుఁడు.

యజ్ఞనారాయణ దీక్షితుఁడు మహామంత్రిలగు గోవింద దీక్షితులువారి కుమారుఁడు. రఘునాథరాయలకంటె యించుక చిన్నవాఁడు. ఈతఁడు రఘునాథునిపద్ద కావ్యనాటకాలంకారాదుల నభ్యసించినాఁడు. గోవిందదీక్షితులవారు రఘునాథునకు విద్యాగురువు. ఆయన యనుగ్రహ విశేషముచేతనే, రఘునాథుఁడు సమస్త శాస్త్రపారంగతుఁడైనాఁడు. ఆనాఁడు సంగీత సాహిత్యములందేమి శాస్త్రవైదుష్యమునందేమి రఘునాథుని మించగలవారేకాదు—సరితూగువారుకూడ లేరు. రఘునాథుఁడు మరల తన గురుపుత్త్రుని తనంతవానిని గావించినాఁడు. విద్యాపూర్తియైనంతనే, యొకనాఁడు యజ్ఞనారాయణ దీక్షితులు, రఘునాథునకు గురుదక్షిణ నొసంగు నుద్దేశముతో బోయినాఁడు. రఘునాథుఁడాతని యభిప్రాయము నూహించి, ముందుగఁదానే, తనకర్ణాలంకారములగు రత్నఖచిత కుండలములను, వజ్రపదకమును, పాదాంగద కంకణములను, యజ్ఞనారాయణకొసంగి, బహూకరించినాఁడు. గురువులవలెనే గురుపుత్త్రులును సంభావనార్హులుకదా! వారిరువురకును గల సన్నిహితత్వమంతగాఢ మైనది. అంతమనోహార మైనది. అంత నిష్కళంకమైనది.

ఒకింత సేపు వారిరువురు నట్లే మౌనము దాల్చి యుండిరి. అంతట దీక్షితులే యిట్లు ప్రశ్నించినాడు.

దీక్షి:— మిత్రమా! ఈ రాత్రి నీవు నిద్రింపఁదలఁచు కొనలేదా?

రఘు:— లేదు. జగద్ద్రోహియగు నాచోళగుని సంహ రించువరకు, నాకు నిద్రాహారములు రెండును సహ్యములుగా కున్నవి. మరియు సామ్రాజ్యమున కెవ్వరు నిజమగు వారసులో నిశ్చితమగు వరకు నాహృదయమునకు శాంతిలేదు. పాపము శ్రీరంగరాయలు విపత్సముద్రమున మునిగి యున్నాఁడు. వేంక టపతిరాయలవారి యంత్యసందేశము సర్వథా నెరవేర్తునని ప్రతిన వట్టిన నేను, చేతులు నులుపుకొనుచు నిచ్చటే యున్నాను.

దీక్షి:— ఈదినమున యాచమనాయునింగారి వద్ద నుండి యొకవార్తావహుఁడు వచ్చినట్లు తెలిసినది. అచ్చటి సమా చారము లేమైనఁ దెలిసినవా?

రఘు:— కొంతవరకు తెలిసినవి. పాండ్యతుండీ రఘునాథులు చంద్రగిరి కేగినారఁట. వెంకటమ్మగారి సాహాయ్య మున జగ్గరాజు ధనాగారమును దనవశము చేసికొన్నాఁడఁట. వేంకటపతిరాయలవారి యంత్యక్రియల పేరిట పుష్కలదాన ములు గావించి యాయూరి ప్రజానీకమును గూడఁదన వంకకే త్రిప్పుకొన్నాడట. రాచనగరులోని పరిచారకులందరు నాతనికే

సశవస్త్రులై యుండుటచే, నంతఃపురవార్త లేమియు దెలియనే లేదఁట. పాండ్యతుండీర విభులదుష్ప్రచారమున కంతమే లేదఁట. ఇవియేవార్తలు.

దీక్షితు:— అయిన నిప్పుడు కర్తవ్యము ?

రఘు:— అదియు నాయనయే వ్రాసినాఁడు. సైన్యము సర్వసిద్ధమై యుండవలెననియు, నావశ్యకమైనచో, నిరంతర ప్రయాణములు గావించియైనఁజంద్రగిరికినేను స్వయముగా రావలెననియు వ్రాసినాఁడు.

దీక్షి:— ఓహో! ఇదియా విషయము. ఈపరిస్థితియంతయుఁజాల విషమముగా నున్నదే. మీనాయనగారింకను శ్రీరంగముననే యున్నారు కదా! వారికీవిషయములన్నియుఁ దెలిసినవా?

రఘు— తెలిసినవి. పాండ్యతుండీరనాథుల ప్రయాణసన్నాహముగూర్చి వినినంతనే మీనాయనగారికిపరిస్థితులన్నియు సరస్సునవి. వెంటనే వారు శ్రీరంగమునకేగి, నాయనగారితోఁబ్రసంగించి నన్నున్నపాటుననే మరలి రమ్మని యాదేశించినారు. వారియాదేశానుసారమే నేను మరలి వచ్చినాను.

దీక్షి:— చోళగునకింకను నాయుష్కాలము మిగిలియున్నది.

రఘు:— ఏమో—కాని ఛిద్ఘనానందులను యోగిని గూర్చి నీవెప్పుడైన వినియున్నావా? కావేరీ తీరముననే యాతని యాశ్రమము కలదు.

దీక్షి:— చిద్ఘనానందులా? అట్టి పేరెప్పుడును వినలేదే? ఎవ్వరో అనామకుఁడై యుండును. ఏమి? విశేషములేమైన గలవా?

రఘు:— (పరధ్యానముగా) విశేషములకేమి లే.

దీక్షి:— ఏదియో యోజించుచున్నట్లున్నావు. నిజముగా నెవ్వియో విశేషములుండి యుండును. చెప్పక తప్పదు.

రఘు:— అంతగాఁ జెప్పవలసిన విషయము లేమియుఁ గనులేవు. ఒక బ్రహ్మచారి చెప్పఁగా విని యాతని యాశ్రమమునకేనుబోయితిని. కొంతసేపాతనితోఁ బ్రసంగించితిని. ప్రసంగావసరమున నేలకో నామనము సంశయగ్రస్తమైనది.

దీక్షి:— ప్రసంగ విషయమేమి?

రఘు:— అనేక విషయములు గలవు; కాని చోళగు నిగూర్చి ప్రసంగించునప్పుడాతని ముఖవైఖరియు, మాటల చందమును నాయనుమానమునకుఁ గారణములైనవి.

దీక్షి:— ఏమి? చోళగపరివర్తనమును సమర్థింపఁ బోయినాఁడా?

రఘు:— లేదు; అది సర్వథాఖండించినాడు. కాని యాతని మహిమాధికమును, బహుధాపొగడినాఁడు.

దీక్షి:— అంతమాత్రమున నాతనిని సందేహింపఁబని లేదు. నిజముగా చోళగుడంతటి మహిమోపేతుఁడేమో!

రఘు:— నీ వాతని మాటలను వినలేదు. అందులకే యిట్లు చెప్పుచున్నావు. ఆయభిప్రాయములు వినుకలి వలన నేర్పడిన వనుఁగాదు. నిశ్చయముగా నాతనికిని జోశీగునకు నేదియో సంబంధముండియుండును. ఇంతేకాదు. మఱొక విచిత్రసంఘటనముగూడ నాయనుమానమును బలపఱచినది.

దీక్షి:— ఏమది ?

రఘు:— ఆయోగియెడ నాకించుకంత యనుమానము జనించినంతనే నేను మరలి పోవయత్నించితిని. అంతట యోగి నన్నొకించుక యాతిథ్యమును గైకొనుమని నిర్బంధించినాఁడు. నేనేమి ప్రత్యుత్తరమీయనాయని యోజించుచుండగా, నాకెదురుగా నున్న ద్వారమున హఠాత్తుగా నొక సుందరి సాక్షాత్కరించి, యాయాతిథ్యము నెంతమాత్రమును స్వీకరింప వలదని హస్తసంజ్ఞచే నన్ను హెచ్చరించి, తృటిలో మాయమైనది. నావైపు తిరిగియుండుటచే యోగి యామెను జూడలేదు.

దీక్షి:— (విస్మయవిస్ఫారిత నేత్రములతో) అంతట నీ వేమిచేసితివి?

రఘు:— ఏదో తాత్కాలికమగు సాకుజెప్పి, యయ్యాతిథ్యమును నిరాకరించి, వెంటనే యయ్యాశ్రమమును వీడి వచ్చితిని!

దీక్షి:— మంచిపని చేసితివి. నిజముగా నిన్నాపరదేవతయే రక్షించినది. వాడెవ్వడో మాయావి, గోముఖ వ్యాఘ్రము. నిన్ను వంచించి విసముఁ దా్రివింప నెంచినాఁడు.

రఘు:— నేనట్లు లేచివచ్చుటచే నాతఁడు సన్నాకివిరికి పందయని యనుకొని యుండును.

దీక్షి:— అనుకొననిమ్ము. అచ్చట నీవసహాయుఁడవు. తన బలము నెదిరి బలము నెఱుంగక ప్రివర్తించుట మూర్ఖలక్షణము గాని వీరలక్షణముగాదు. ఇంతకు నిన్నాతఁడు వీరుని వలె నెదుర్కొనలేదు. బహిరంగముగ ద్వంద్వ యుద్ధమున కాహ్వానింపనులేదు. కేవలము శాంతమూర్తి యగు యోగివలె నటించుచున్న యాతని నీవెట్లెదుర్కొందువు?

రఘు:— నిజమే! నాయెడఁబక్షపాతబుద్ధిగల వారీ ఘట్టమునిట్లే యన్వయింతురు. నాయెడ సానుబూతిలేని వారు?

దీక్షి:— నీయెడ సానుభూతిలేనివారు నీవుచేయుసర్వకార్యములకు నపార్థమునేకల్పింతురు. తటస్థులగు వారెన్వరే యర్థము చెప్పిన నద్దానికే తలయూచుచుందురు. స్వయముగాఁ దామెద్దాని నెవ్విధమున నన్వయింప వారకొనరు.

రఘు:— కాని యాసుందరి యెవ్వరు? అను నదియేనన్ను వేధించుచున్న ప్రిశ్న.

దీక్షి:— దానికి సమాధానము ముందే చెప్పితిని కదా! ఆపర దేవతయే యని.

రఘు:— కాదు కాదు. నిస్సందేహముగా నామె మానవియే.

దీక్షి:— మానవియో దానవియో ఈతర్క వితర్కములతో నాకు పనిలేదు. నాప్రాణ స్నేహితుని ప్రాణములుగా పాడిన యామెనాకు సాక్షాత్పరదేవతయే.

ఇట్లు వారు ప్రసంగించుకొనుచుండగా నెద్దియోసవ్వడి వినవచ్చినది. అనతి దూరముననున్న యయ్యారామ ద్వారమున రాజభటులెవ్వరినో యడ్డగించు చున్నట్లా కేకలు వినవచ్చినవి. రఘునాథునకొక స్త్రీయాక్రిందన ధ్వనియు వినవచ్చినది. ఆతనికావిషయమేమో తెలిసికొనవలెనను కుతుకము జనించినది.

రఘు:— ఎవడురా అక్కడ?

అనతిదూరమున చేతులు మోడ్చి నిలిచియున్న యొక భటుడు చేతెంచినాఁడు.

భటు:— చిత్తము ప్రభూ! ఆజ్ఞ.

రఘు:— ఆరామ ముఖద్వారమునుండి వినవచ్చు నా కేకల నాలించితివికదా! కారణమేమో తెలిసికొని త్వరగా రమ్ము.

భటుఁడుత్వరితగతి నేగి, నిమిషములో తిరిగివచ్చినాఁడు.

భటు:— ఏమియునులేదు ప్రభూ! ఎవ్వరో యొకపిచ్చిది ఈనాడే యిన్నగరమున కేతెంచినది. ఇప్పుడారామములోఁ

బ్రవేశింప యత్నించు చున్నది. రాత్రిరెండుఝాములు గడచిన పిదప వీథులలో నెవ్వరును సంచరింపరాదని మహామంత్రుల యాజ్ఞ. అట్లు సంచరించువారిని బట్టి బంధింపవలెననియు నాజ్ఞ కలదు. కావుననే రాజభటులామె నదలించుచున్నారు. మరియు నిద్వారము గూడ కేవలాంతఃపురమునకు సంబంధించినది. ఒరులిందు కాలిడ రాదను రాజశాసనము ముందే కలదు.

రఘు:— ఆమె యిందేల ప్రవేశింప యత్నించుచున్నది. అందును నిట్టియర్థరాత్రమున.

భటు:— ఆమె తిమ్ము దర్శింపఁ గోరుచున్నది. పగలంతయుఁ దాము రాజకార్యనిమగ్నులై యుండుటచే నామెకు తమ దర్శనము లభింప లేదఁట. తమరిప్పుడిచ్చటనున్నారని యెట్లో గ్రహించినట్లున్నది. ప్రభువులను దర్శింపనే యెంచుచుండఁగ నీ భటులడ్డగించినారు.

దీక్షి:— అడ్డగింపఁగా నామె మరలి పోలేదా?

భటు: లేదు. వారితో వాదించుచున్నది.

దీక్షి:— ఏమని?

భటుఁడించుక సంకోచింప సాగెను.

భటు:— తంజాపుర ప్రభువు లనాథులపాలిటి కల్పవృక్షములని వినియున్నాను. ఇప్పుడా మాట వట్టినేతిబీరకాయయే యైనది. అని యనుచున్నది.

రఘు:— శీఘ్రముగా నామెను మా సన్నిధికిఁ గొనిరమ్మనుము. పొమ్ము.

భటుఁడు చిత్తమని పరువు వెట్టినాఁడు. కొలదిసేపటిలోనే ఆమె రాజసాన్నిధ్యమున నధోముఖయై నిలిచియున్నది. ఇరు వంకల భటులు, నమ్రులై యుండిరి.

రఘు:— అమ్మా! నీవెవ్వరు? ఈ నీపుత్త్రిన కేమి యాజ్ఞ? చేతులు కట్టుకొని చేసెదను. సందేహము వీడి తెల్పుము తల్లీ!

పొంగి పొరలి వచ్చుదుఃఖము నామె యాపుకొనలేక వెక్కి వెక్కి యేడ్వ సాగినది. కాని రఘునాథుని యనునయ వాక్యములచే నొకింతసేపటికి కుదుట పడినది.

స్త్రీ:— ప్రభూ! నేను సింహళ ద్వీపాధిపతి భార్యను.

ఈ మాటలెట్లో ఆమె నోటి వెంబడి వచ్చినవి. ఇంక నామె మారుమాట పల్కలేక భోరుమని యేడ్చుచు నందే కూలబడి పోయినది. రఘునాథుఁడు నిశ్చేష్టుఁడైనాఁడు. నిర్విణ్ణుఁడైనాఁడు.

రఘు:— ఏమిది? సింహళేశ్వరియా? నేను జాగ్రదవస్థ యందే యున్నానా? లేక కలగనుచున్నానా?

స్త్రీ:— కలకాదు; కల్లకాదు ప్రభూ! నేను సింహళేంద్రుని భార్యనే. దురదృష్టవశమున నిట్టియవస్థను బొందితిని.

రఘు:— అమ్మా! నీయుదంతమంతయు నామూలాగ్రముగ నెఱింగింపుము.

స్త్రీ:- ఏమని చెప్పుదును? కొలది కాలము క్రిందట బుడతకీచుల రాయబారియొకఁడు నాభర్త వద్దకేతెంచి, సింహళమున వర్తకము చేసికొనుట కనుజ్ఞ నొసంగ వేడినాఁడు. నా భర్తయు, నమాయికముగా వాని మాటలను నమ్మి యనుజ్ఞ యిచ్చినారు. తరువాత వారు మాయూర నొక వర్తక స్థానమును నిర్మించి కొనిరి. ఆబుడతకీచుల నాయకునకు, మావారికిని గొలది కాలములోనే ప్రబల స్నేహ మేర్పడినది. కల్లకపటము తెలియంగని నాభర్తయాతనికి మారాజ్యమునకు సంబంధించిన రహస్య విషయములన్నియుఁజెప్పినారు. నిజముగా వారాయూరు వర్తకమునకై రాలేదు. మారాజ్యమునే కబళింప నేతెంచిరి. వర్తకులను పేర నోడలలో సిపాయీలు వచ్చిరి. అమ్మకపు దినుసులను పేర నాయుధ సామగ్రి వచ్చినది. ఈమోసమేమియు గ్రహింపని మేము నిశ్చింతగా మాకోటలో నిదురించుచుండగా నొకనాటి రాత్రి వారు మాకోట ముట్టడించిరి. మేము కేవల మసహాయులము. అసన్నద్ధులము. ఉపరివారికి మాకోట మర్మములన్నియుఁదెలియును. కావునఁగోట వారివశమగుట కెంతయో కాలము పట్టలేదు. అదృష్టవశమున నాభర్త వారికి కోట రహస్య ద్వారమును మాత్రము చూపలేదు. అంతట చేయునది లేక కతిపయ పరివార సమేతులమై మేమా రహస్య ద్వారమున —టపడి ప్రాణములు దక్కించు కొంటిమి. ఒక యోడను మాత్రమెట్టెటో సంపాదించుకొని సముద్రమును తరించితిమి; తంజాపుర ప్రభువులకును తమకును వంశ పారంపర్యమగు స్నేహానుబంధము కలదనియు, వారిసాహాయ్యమున శత్రునాశ

ముగావించి రాజ్యమును దిరిగి సంపాదింప గలననియు, నాభర్త నాకుఁదఱచు చెప్పుచుండెడివారు,

రఘు:— అవును. మేమిరువురము నాబాల్య మిత్రులము సింహాళేశ్వరు లిప్పుడెచ్చట నున్నారు ?

స్త్రీ:— ఆవిషయమే చెప్పనున్నాను. సముద్రతీరమును జేరినను మాకు శత్రుబాధ తప్పలేదు. వారుమమ్ము వెన్నాడియే వచ్చు చుండిరి. అంతట మేము మారువేషములు వైచుకొని, తంజాపురి జేర నేతెంచు చుంటిమి. శత్రువులఁబారిఁబడకుండు టకై మేము దినమున కొంకొక్క మార్గమునఁ బయనము సాగించు చుంటిమి. కాని మమ్ము దుర్విధి వెన్నాడుచునే యున్నది. ఒకనాడు మేమొక యటవీమార్గమునఁ బోవుచుం డగా, నాకసమంతయు మేఘావృతమైనది. చటుల ఝంఝూ ప్రభంజనము చెల రేగినది. కారుచీకటులు గ్రమ్మినవి. ఫెళఫె ళార్భటులతోఁ జెట్లు విరిగినేలఁబడఁ జొచ్చినవి. హోరుమని గాలి వీచు చుండుటచే నొకరిమాట యొకరికి వినవచ్చుట లేదు. కుంభవృష్టిగురియఁ జొచ్చినది. అట్టిసమయమున గూడ నా నాథుఁడు తన సహజ ధైర్యమును వీడలేదు. అనతిదూరముననే యొక కొండగుహాకలదనియు నచ్చటి కేగినఁ బోయినవో నింక నపాయ శంక లేదనియుఁజెప్పి, నాకొకచేయి నూతగానిచ్చి, రెండవ చేతితో మార్గమున కడ్డుగానున్న కంటకలతా సంతతు ల దొలగించు కొనుచు నాయన నడచు చుండిరి. ఎట్లో మహా కష్టముపై నాగుహా చేరుకొంటిమి. కాని నేనా జడివానలోఁ దడిసి యుండుటచే, వడ వడ వణక జొచ్చితిని. అంతలో వాన

యు వెలసినది. చలిగాలి మాత్రము జోరుగా విసర సాగినది. నాయవస్థఁగాంచి నానాథుఁడు జాలిగొని, గుహాముఖమున కేగి యిటునటుఁబరిశీలింపగా, ననతి దూరమ్మున నేదియో వెలుగు గానిపించినది. ఆకాంతిఁగాంచినంతనే యదిమనుష్య నివాసమై యుండుననియు, నందున్నవారు చలి కాగుటకై య గ్నిని జ్వలింపఁజేసి యుందురనియు, నక్కాంతి పుంజ మయ్యగ్ని సముత్థితమేయనియు వారు భావించిరి. నాకావిషయమంత యుఁజెప్పి, వెంటనే యా వెలుగున్నవైపు నడువ సాగిరి. నేనం తవలదని వారించినను వినరైరి. ఏదుర్ముహూర్తమున నన్నందు వీడి పోయిరో యిప్పటికిని వారి దర్శన భాగ్యము నాకు మరి కలుగలేదు. నేనా గుహాంతరమున నెంతిసేపట్లు వేచియుంటినో సరిగాఁజెప్పఁజాలను. ఎంతకును వారు రాకుండుటచే, గుహ యీవలికి వచ్చి చూచితిని. ఆవెలుగుదెస గానరాలేదు, అంత యునంధకారబంధురము. గీమనికీచురాళ్లురొద సేయుచుం డెను. నక్కలు కూయుచుండెను. నాకేమి చేయుటకుఁబాలు పోలేదు. ఒకమారు వారినన్వేషించుకొనుచుఁ నాయంధకార మునఁ బోవ బుద్ధిపొడమినది. కాని వారు తిరిగి వత్తురేమో! అప్పుడు నన్నిచటఁగానకున్నచో నన్నన్వేషించుచు వారెందుఁబో వుదురో! అప్పుడొకరియునికియింకొకరికిఁ దెలియక, పలువెతలకు లోనుగావలసివచ్చును గదా కావున నిందే వేచియుండుట యుత్తమము—అని వెంటనే యింకొక యూహ పొడమినది. అదియే సరియైన యూహగానెంచి నేనందే నిలిచియుంటిని. అంతటఁదూరుపు తెల్లవారినది. నా నాథుఁడప్పటికిని తిరిగి

రాలేదు? ఇంకనేనందు మసలనేలయని, యయ్యారణ్యమున వారిని వెదకుకొనుచు బయలుదేరితిని. ఎందును వారిజాడ కానరాలేదు. ఆకటిచే నటమటించుచు నొకగొల్లని సాహాయ్యమున నీయూరు చేరితిని. ఇన్ని కష్టములకు లోనైనను, మొండిప్రాణము నన్నేలకో పెడకున్నది. నాజీవిత సర్వస్వమునకే దూరమైతిని. వారెందున్నారో? ఏమైనారో?

దుఃఖావేగమున నామె వల వల యేడ్వసాగినది. ధీరుడయ్యు రఘునాథుఁడు కరుణార్ద్రహృదయుఁడు. ఒరులకష్టములఁజూచి యోర్వజాలడు. అందును నీవిషయము తనప్రాణమిత్రునకు సంబంధించినది. ఆతని కన్నులుగూడ నించుక చెమ్మగిల్లినవి. కాని యంతలోనే ధైర్యమును వహించి యామెనోదార్చుచు నిట్లుపలికినాఁడు.

రఘు:— అమ్మా! నీవింక విచారింపకుము. నీకష్టములన్నియు గట్టెక్కినవనియే తలంపుము. ఇప్పుడే, ఈముహూర్తముననే, నీభర్తజాడలరయుటకై, తగినవారినియోగించెదను. అచిరకాలముననే, సుఖమైయున్న నీభర్తను నీవు చూడగలవు. మరియు మిత్రద్రోహమునకుఁ బాల్పడిన బుడతకీచులపీచమడంచి మీరాజ్యమును మీకిప్పింతునని యిదే మాకుల దేవత సాక్షిగాఁబ్రతిన గైకొనుచున్నాను.

అప్పుడు రఘునాథుని ముఖమండలమున సత్యోజ్వల తేజఃపుంజము తాండవించినది. కరుణారస భరితములగు నాతని నేత్రకమలము లరుణారుణకాంతుల నుద్దీప్తములైనవి. కాని క్షణకాలములోనే యాతని ముఖము మరలఁబ్రసన్నాకృతి

వహించినది. అంతట నాతఁడు సగౌరవముగ సింహాళేశ్వరినంతః పురమున కనిపి యామెకునుచితోపచారము లొనర్పఁదగు వారిని నియోగించి, దీక్షితులతోఁదన ప్రాసాదమున కేగినాఁడు.

## నాలుగవ ప్రకరణము.

సమయము నిశీథము. రోదసీకుహరమంతయు గాఢాంధకారబంధురమై యుండెను. ఆకసమంతయు నిబిడ నీరంధ్రజలధరమాలికాలంకృతమై యుండెను. అప్పుడప్పుడొక్క తటిల్లత మాత్రము తళుక్కుమని మెఱసి యంతలోనే యంతరించుచుండెను. హోరుమని చలిగాలి వీవసాగెను.

అది చంద్రగిరిలోని రాజప్రాసాదము. ప్రబల ప్రభంజన వేగమున నాకోట గోడలపైనున్న దీపములన్నియు నారిపోయినవి. ప్రాసాదాంతర్భాగమున మాత్రము కొన్ని దీపకళికలు మిన్కు మిన్కు కాంతుల నీనుచున్నవి. ప్రాసాద రాజము కాలపురుషుని కరాళ వదన గహ్వరమువోలె భయదమై గన్పట్టుచుండెను. అట్టి భయంకర నిశీథమున నెవ్వరు మేల్కనియుందురు? చంద్రగిరి యంతయు మాటుమణగియుండెను. క్రూరాభీలవన్య మృగములు గూడ గిరి గుహాంతరముల నడంగియున్న యన్నిశీథమున నెవ్వరా రాజప్రాసాదమున సంచరించువారు? నల్లని ముసుగులు ధరించి, మెల్ల మెల్లగా పిల్లియడుగులు వేసికొనుచుఁ బోవుచున్నారు. చోరులా యేమి ? కాదు కాదు వారిచేతులలో భయంకర కరవాల

ములు మెఱయుచున్నవే! మహాపీనులా? అయిన ముఖములకు మసి పూసుకొననేల? నీలి ముసుంగులేల? నిశ్చయముగా వీరర్థ రాత్రిమున నెద్దియో ఘోర కార్యము గావింపనేగుచున్నారు. అయ్యయ్యో! రాజప్రాసాదమున నందరును గాఢ నిద్రాపరవశులై యున్నారే? ఈనరరూప రాక్షసులు వారినందరను సంహరింపరు కదా! నేడో రేపో సింహాసన మధిరోహింపనున్న శ్రీరంగరాయలు, సపత్నీ పుత్ర బాంధవముగ నిందే నిదురించుచున్నాఁడే. ఈహత్యా ప్రయత్నమంతయు వారికొఱకై కాదు కదా! ఏమో! రాజకీయపరిస్థితులన్నియు నుల్లోల కల్లోలములై యున్నవి. ఎప్పుడెట్టియత్యాచారములు జరిగినను నాశ్చర్య పడవలసిన యవసరములేదు. అందును శ్రీరంగరాయలకు జగ్గరాజాదులగు మహాశత్రువు లనేకులు గలరు. ఆతని యసువుల గ్రసియింపఁ గాలభుజంగివలె వెంకటమ్మ యంతఃపురముననే గాచియున్నది. ఇంతకు శ్రీరంగరాయుల కవి మంచిరోజులు కావు.

అయ్యయ్యో! అది యేమి? ఆకావలిగాయువారా ఘోరహంతకులకు వంగి వంగి సలాములు సేయుచుఁ దారివచూపుచున్నారే! ఎంతద్రోహము! ఔను. ఇదియంతయు లక్ష్మి ప్రభావము. ప్రపంచము నందలి సకలానర్థములకును మూలము ధనము. వానలోఁ దడువని వారును, ధనవాంఛకు లోనుగాని వారును లేరు. కాని యింతటి స్వామి ద్రోహమా?

పాఠక మహాశయా! హంతకులు ముగ్వురు అభ్యంతర మందిరమునఁ బ్రవేశించిరి. వారిననుసరింతము రమ్ము. అదిగో

వారిలో వారెద్దిరియో ప్రసంగించు కొనుచున్నారు. సావధానముగ నాలింపుము.

"జగ్గారాజా! వీరందరు చచ్చినవారివలె పడియున్నారు. మహారాజులుంగారిచ్చిన మందును బ్రయోగించినావా యేమి?."

జగ్గ:— సరి సరి; ఇంకను బ్రయోగించితివా యనియడుగుచుంటివే? మహా ప్రయత్నము మీద మళయాళ మాంత్రికుని కడనుండి, కృష్ణభూపతులా యోషధిని సంగ్రహించినాకుం గటాక్షించిరి కదా! దానిని వెంటనే ప్రయోగించి కార్యమును సానుకూలము గావించుకొనక మీనమేషములు లెక్కించుచుండుటకు నేనేమిమూర్ఖుఁడనా? భైరవా! నీవేమనుకొనుచున్నానో? జగ్గరాజలిగిన జగత్త్రయమును గంపింప వలసినదే. నీవే మందువు కరాళా?

కరా:— నేనేమందును. నిస్సందేహముగ నీవురావణుండవే. మరియు నీవధికుడవేమో! రావణుఁడు మాత్రమిందరిని హత్యచేసినాఁడా?

భై:— ఈతఁడు చెఱచినంతమంది స్త్రీలను జెఱచినాఁడా?

జగ్గ:— మరిమీరో? మీరెవ్వరు? మారీచసుబాహులా?

కరా: ఈపోల్కి బాగుగనే యున్నది. కాని దేవాంతక నరాంతకులన్నచో

భై:— మరియు బాగుండును.

జగ్గ: మనపూర్వ సందరము పరాంతపులమే.

భై: కాని రావణాదులను రాక్షసులందరు రఘువీరుని చేతిలో జడిసినారు.

జగ్గ: (తుల్లిపడి) ఏమి? రఘువీరుడా? ఎక్కడ?

కరా: (నవ్వుచు) ఏమట్లు తుల్లిపడుచున్నావు. జగ్గరాజు పేరు వినినంతనే జగత్రయము కంపించు నంటివే. ఇంతలోనే భయకంపమా?

జగ్గ: (సద్దుకొని) ఆ ఏమియును లేదు ఏమో పరధ్యానముగా నుండి యిట్లయితిని. (మీసముపై చేయినైచి) భయ కంపము లనునవి జగ్గరాజు పరిసరముల నుండజాలవు.

కరా: కాని మిత్రమా! నేనెన్నో హత్యల గావించినాను. కాని యిందరి నొక్కమారు చంపలేదు. ఇట్టి యమనాయకుల నిద్రా పరవశుల, నెన్నడు హత్య గావింపలేదు. నా హృదయమేలకో దడదడ కొట్టుకొను చున్నది.

భైర: నాకునట్లే యున్నది. ఇట్టి హత్యాకాండము నెవ్వరు నిర్వహింపగలరు?

జగ్గ: (వెడనవ్వునవ్వి) జగ్గరాజు మూర్ఖుడుకాడు. ఆతని యూహ లెన్నడు నపోహలుకాలేదు. నేనిట్లగునని ముందే యోజించితిని. ఇదిగో! అమృతము (సారాయముతో నిండిన యొక పాత్రమును జూపుచు) దీనిని ద్రావుడు. మీ శంకాతంకము లంతరించును. హృదయ గ్రంథులకు బలము సేకూరును. చిత్తమునకు ధైర్యస్థైర్యములు సమకూడును.

కరా: (తేరిచూచి) సారాయమా! నెజ్జి జగ్గరాజా! మేమది చవిచూడకయే, యిట్టిసాహస కృత్యమును గావింప నే తెంచితి మనుకొంటివా? మాముఖవాసనయు గ్రహింపలేవా?

జగ్గ: (గంభీరముగ) జగ్గరాజు వెంగలికాడు. మీరు మద్యమును గ్రోలియే వచ్చినారని గ్రహింపనివాడుగాడు. కాని యీ మద్యము నట్టిదే యనుకొంటివా? ఇది సీమలో తయారైన సారాయము. అందును నత్యుత్తమము. ఇది సేవించిన వారికిఁ జీకు చింతలుండవు. ఎంతటి ఘోరకార్యము నాచరించు నప్పుడు గూడ జిత్తస్థైర్యముసడలదు. వేయేల...మనవంటి వారికిది యమృత రసాయనమే? రండు సేవింతము.

భై: ఈలోగా వీరు మేల్కొనరు కదా!

జగ్గ: మేల్కొనుటయా? అది కలలోని మాట. ఇక్కే యుంచినను వీరు తెల్లవారువరకు మేల్కొనలేరు.

కరా: ఏమియోషధి? జగ్గరాజా! దానినెట్లు ప్రయో గించితివో మాకించుక చెప్పరాదా?

భైర: మాదగ్గరనేనా నీ దాపటికము.

జగ్గ: లేదు లేదు దాపటికములేదు. నేనా విషయ మునుగూర్చి చెప్పఁబోవు చుండగనే మీరు నన్నడిగితిరి. ఆ ప్రక్రియ యత్యల్ప కాలములోనే ముగియునది; ప్రయోగ మును నతిసుకరమే. ఆ యోషధినగ్నిలో వైచిననది నలుదెసలఁ బొగఁజిమ్మును. ఆ ధూమ మాఘ్రాణించినవారు నిమేషకాల ములోనే గాఢ మూర్ఛాపరవశులగుదురు. అట్లు మూర్ఛలో

మునిగి నాలుగు ఝాములుందురు. ఈరాత్రి, వీరందరు నిద్రించిన తరువాత నీమందిరముననే యయ్యోషధిని బ్రయోగించి నట్లేర్పాటు చేసినాను. దాని ప్రభావమెట్టిదో మీరు కన్నులార చూచుచున్నారు కదా! మరియొక యాశ్చర్యకరమగు విషయము. దీనిని బ్రయోగించుటకై నియోగింపఁబడినవాఁడు, నిప్పులో నోషధిని బడవైచిన యుత్తరక్షణముననే ఆ ప్రదేశమును వీడి పరువులెట్టుచు నీవలికి వచ్చినాఁడు. కాని యాతఁడు గూడ నొకింతసేపు పరాకుగానే యున్నాఁడు.

కరా: ఈభవనమునకు నలువంకల నరమైలు దూరములో నిండ్లులేవు కావున సరిపోయినది. లేకున్న వారిపనియుఁ గుటుక్కే.

అంతట జగ్గరాజు మూఁడుపాత్రములనుదీసి సారాయమును బోసినాఁడు. అది తీవ్రవాసనల నలుదెసల జిమ్మసాగినది. దాని తైక్ష్ణ్యమును బ్రశంసించుకొనుచు నాముువ్వురు నాసారాయమును గ్రోలిరి. మధ్య మధ్య రుచికరములగు నంజుళ్లుగూడ నారగించిరి. ఒకింతసేపునకే వారి యుత్సాహము మిన్నుముట్టినది. భూతావేశము నందిన వారివలె తూగుచువారు కరవాలముల గ్రహించిరి.

కరా: జగ్గరాజా! దీపము నార్పివేయుము. ప్రసన్నమధురములగు వీరి ముఖవిలాసములను గాంచుచు వీరిని సంహరింపఁజాలము.

జగ్గ: (వెడనవ్వునవ్వి) ఇంతేనా నీధైర్యము! ఇదిగో చూడుము. (తళ తళ లాడునొక బాకుతీసి శ్రీరంగరాయలను దనలావుకొలది పొడుచును. చివ్వుమని రక్తముపైకి చిమ్మును. జగ్గరాజు ముఖము, చేతులు రక్తపూరితములగును. రాయల నోటమాటయైన వెలువడ లేదు,)

కరా: నీవునిజముగా రాక్షసుఁడవు. పచ్చినెత్తురు ద్రావు భయంకర శార్దూలమవు.

జగ్గ: ఔను నేనట్టివాఁడనే. కాని నాశత్రువులకు మాత్రమే. నామిత్రబృందమునకు నేనమర తరువును.

భై: జగ్గరాజా! దీపమార్పవా?

జగ్గ: ఆర్పను.

భైర: ఏల?

జగ్గ: మరణావసరమున స్రవించు వీరి రక్తమును నేను కన్నులార జూడవలయును. అప్పటికిగాని వీరిపై నాకున్న కసి తీరదు. (రంగరాయల మెడ నటు నిటు బొంగరమువోలె త్రిప్పి ఎడమ కాలితో నొక తాపుతన్నెను) చూడుము ఈపంద రేపు సింహాసనము నధిరోహించునఁట. వెలుగోంటివారు వీనికి సాహాయ్యముగావింతురఁట. తంజాపురమువారు శ్వేతచ్ఛత్రమును బట్టుదురఁట. మూర్ఖులు వట్టిమూర్ఖులు. (మీసముపైచేయి వైచి) జగ్గరాజలిగిన...

కరా:— జగత్రయమును గంపింప వలసిన దే.

భైర:— జగ్గరాజా! నీవుపిరాధిపిరుల నధిక్షేపించుట పాడిగాదు. నీవికెందరిని జంపినను నీవొక హంతకమాత్రుడవే. వీరుడ వెన్నటికిని గావు. ద్వంద్వయుద్ధముననో సంకుల సమరముననో ఒక్కని సంహరింపుము. పరాజితుని గావింపుము. నిన్ను లోకమంతయుఁ బోటుమానిసిగా నెన్నుదురు.

జగ్గ:— మీరు మాటలతోనే కాలక్షేపము సేయుచున్నారు గాని యిప్పటి కొక్కనిగూడ చంపలేదు. ఈధర్మపన్నముల కేమి. రేపు లక్షచెప్పి కొందము. కాలమతిక్రమించుచున్నది. త్వరపడుడు.

భైర:— అమాయికములగు వీరి ముఖములను వీక్షించినచో నాకు జాలి కలుగుచున్నది.

జగ్గ:— మిత్రమా! నీవు మరల మొదటికే వచ్చుచున్నావు. నీమస్తిష్కముపై నింకను మద్యము పని చేసినట్లు లేదు. రండు మీరిద్దరు నీ మద్యమును గ్రోలుడు.

మరల వారందరు మద్యమును గ్రోలినారు; ఈ మాఱు వారికి రాక్షసావేశము గల్గినది. ముగ్గురు మూఁడు సునిశితకరవాలముల గొనిరి. హత్యాకాండ మారంభమైనది. కునికి కునికి దీపకళికయు నారిపోనున్నది. ఒకరు; ఇద్దరు; ముగ్గురు; నల్గురు పదిమంది. హత్యాకాండ ముగిసినది. వారు ముగ్గురును రక్తసిక్తాంగులైరి.

కరా:— అమ్మయ్య! పని ముగిసినది.

జగ్గరాజొక్కమారు పకాలున నవ్వినాఁడు. భైరవ కరాళురిద్దరును దుల్లిపడినారు. ఒక పిశాచము వారిని హేళన సేయుచున్నట్లుండెను.

కరా:— జగ్గరాజా!

జగ్గ:— ఆ!

కరా:— మాపని ముగిసినది.

ఎవ్వరో దూరమునుండి ముగియలేదు అని కేకవేసినట్లాతనికిఁ దోచినది. మరల తుల్లిపడినాఁడు.

భైర:— ఎవ్వరో ప్రక్కగదిలో నవ్వుచున్నారు. ఎవ్వరు ?

ఆతనికి ముచ్చెమటలు పోసినవి. చేతితో నుదురుతుడుచుకొనఁబోయినాఁడు. నుదురంతయు రక్తమయము; ఆతఁడు కన్నులెత్తి నలువంకల చూచినాఁడు. కరాళుఁడు, జగ్గరాజును రక్తపానము సేయుచున్న రెండు పిశాచములవలె నాతనికి గానుపించిరి.

భైర:— జగ్గరాజా! కొంచెము మద్యమిమ్ము.

కరా:— నాకుఁగూడ.

జగ్గరాజిటు చూచినాడు. భైరవ కరాళు లిద్దరు నెద్దియో పరధ్యానములోనున్నారు. వెంటనే రెండు పాత్రములలు మద్యముతోనింపి యందెద్దియో చూర్ణము కలిపి ఇద్దరకు నా పాత్రములందిచ్చినాఁడు. వారిద్దరు రెండు గుక్కలలో

నామద్యమును గ్రోలిరి. రెండు మూడు నిమిషముల లోనే, తూలుచు నేవో యస్పష్టవాక్యములాడుచు నేలఁగూలిరి. వారి ప్రాణ వాయువు లెగిసిపోయినవి. జగ్గరాజొక్క వికటాట్ట హాసము గావించినాఁడు. దీపమింకను అస్పష్టకాంతులనీనుచునే యున్నది. ఎదురుగా నొక నిలువుటద్దమున్నది. అందాతని ముఖాకృతి యాతనికి గోచరించినది. జగ్గరాజు తుల్లిపడినాఁడు ఏమది ? పిశాచమా? నలువంకలఁజూచినాఁడు. రక్తసిక్తమానవ కళేబరములు. రక్తసిక్తములైన వస్త్రములు — గానవచ్చినవి. తనయొడలొక్క మారు గగుర్పొడిచినది. ముచ్చెమటలు పోసినవి. ఎవ్వరో కదలుచున్నది? శ్రీరంగరాయలు కాదుకద! ఇంచుకదరికేగి చూచినాఁడు. వెనుక నెవ్వరో నిలిచినట్లైనది? మరల తుల్లిపడినాఁడు. వెనుదిరిగి చూచినాఁడు. ఎవ్వరును లేరు. తన ధైర్యము సడలుచున్నది. ఇంచుక మద్యమును సేవింపవలయును. మద్యమును గ్రోలినాఁడు. హుషారుచేకూరినది. భైరవ కరాళుల కళేబరములు ముందు పడియున్నవి. వానినొక తన్ను తన్ని వికటాట్టహాసము గావించినాఁడు. మూర్ఖులు; వట్టిమూర్ఖులు జగ్గరాజునకు వీరా సహాయులు? పిరికిపందలు రక్తపాతమునకింత జడుపా? అప్పుడాతనిలోఁబైశాచికమగు నొకయూహ పొడమినది. వెంటనే బాకు తీసి, కరాళుని యురమున గాఢముగ బొడిచినాఁడు. అచ్చటనే కరాళుని బాకుగలదు. దానినిదీసి భైరవుని బొడిచినాఁడు. మరల నొక వికటాట్టహాసము గావించినాఁడు. ఎట్టయెదుట నెవ్వరా నిలిచియున్నది ? రఘునాథరాయలా ? ఏమా పెదవులపై చిఱునవ్వు? రఘునాథా! నన్నుజూచి నవ్వు

చున్నావా? అయిన నీకును నిదియేగతి. ఈరాత్రి జగ్గరాజొక పిశాచము; ఈరాత్రి జగ్గరాజు పచ్చినెత్తురు వరదలలో మునిగి తేలును. జాగ్రత; ఆతఁడొక్క పరువునఁబోయి బాకుతో లావు కొలది బొడిచినాఁడు. ఏమిది? వట్టిగోడయేనా? అతని మస్తిష్క మించుక చెదరుచున్నట్లాతనికిఁదోచినది. ఒక్క వెకిలి నవ్వు నవ్వినాఁడు. అంతలో ద్వారముకడ నెవ్వరో స్త్రీమూర్తి నిలిచి యున్నట్లాతనికి దోచినది.

"ఎవరునీవు. రక్కసివా? అయినరమ్ము ఇరువురమును నరశోణిత పారణ గావింతము."

స్త్రీ :— రక్తసిక్తాంగుఁడగు జగ్గరాజును జూచినంతనే యాస్త్రీయించుక చలించినది. కాని యంతలోనే కుదుటపడినది.

స్త్రీ:— నీకు మతిపోయినదా? నేను వెంకటమ్మను.

జగ్గ:— వెంకటమ్మవా! అయినచో నిజముగా రక్కసివే. రమ్ము మనమిర్వురమును నరకలోకమునకు బోవుదము.

వెంకటమ్మ యొడలు జలదరించినది. కాని కర్తవ్యము వెంటనే స్మరణకు వచ్చినది. ధైర్యము చేకూరినది.

వెంక:— తమ్ముడూ! ఇది మసలుటకు సమయముగాదు. ఎవ్వరైనఁజూచినచో మనకిర్వురకును నిజముగా నరకమేగతి యగును. రక్తసిక్తములగు నీయుడుపులతో నీవిచ్చట మసలుట ప్రమాదకరము కదా! రమ్ము; త్వరపడుము.

జగ్గ:— ఎచ్చటికి? నరకమునకా?

వెంక:— ఔను.

## ఐదవ ప్రకరణము.

చంద్రగిరి యంతయు నట్టుడికి నట్లుడికి పోవుచున్నది. తెల తెల వారుసరికే శ్రీరంగరాయాదుల మరణవార్త యూరంతయు నల్లుకొని పోయినది. ఏయింటఁజూచినను గుస గుస లే. ఏసందులోఁజూచినను రహస్యప్రసంగము లే. శ్రీరంగ రాయాదులఁదలంచుకొని యుస్సురని నిట్టూర్పు విడువనివాఁడును జగ్గరాజాదులఁదలంచుకొని తిట్టిపోయని వాడును నాఁడూర మందునకైన లేడు. కాని యొక్కరుగూడ నోరెత్తి బాహాటముగా నీవిషయమును జర్చింపఁజాలరైరి. విచ్చుకత్తులుపూని రాజ భటులుగస్తు తిరుగుచుండిరి. రాచబాటలలో నాయుధపాణులైన సిపాయిలు బారులుదీరి నిలిచియుండిరి. ఇరువురొక్కచో నిలిచి ప్రసంగింప రాదు. ఎవ్వరును గొంతెత్తి పలుక రాదు. అట్లు ప్రసంగించిన వారిని రాజభటులు కాలుసేతులు బంధించి కారాగారమునఁ బడవేయుచుండిరి. రాజభటులలో ముప్పాతిక ముప్వీసము పాండ్యతుండీర దేశములకు సంబంధించినవారే. సాహసించి కొందరు ప్రజలు మహామంత్రులకడకేగి, మొర పెట్టికొనిరి. ఇట్టిశాసన మెవ్వరు కావించిరని కొందరు ప్రశ్నించిరి. శ్రీరంగరాయాదుల మరణమున కెవ్వరు కారకులో మేము సహేతుకముగఁ జెప్పగలమని కొందరు ముందువచ్చి నిలచిరి. కాని మహామంత్రులు చలింపలేదు. గాంభీర్యమును వీడలేదు. కొన్నినాళ్లోర్మి వహింపుఁడని యొక్కటే సమాధానమును జెప్పి నారు. అంతలోనే యాయుధపాణులగు భటులేతెంచి, ప్రజా

సీకము నగలించి దూరదూరముగా తరిమివేసి, మహామంత్రిల యింటిచుట్టు కావలి గాయమొదలిడిరి.

అయ్యో! మహామంత్రులనుగూడ నిర్బంధమా! ఎంత యరాజకము! ఎంతదౌర్జన్యము! అని ఎవ్వడో దారిబోవుచుఁ బల్కినాఁడు. వానిదురదృష్టవశమున నాపల్కులు పహారా జవానుల కర్ణకుహరములఁబడినవి. వెంటనే వారాతనిపైఁబడి కాలుసేతులుబంధించిరి. వాఁడు మొఱ్ఱోయని యేడ్చుచుండెను. ఈయొక్కయపరాధమునుక్షమింపుడని బ్రతిమాలుకొనుచుండెను. కాని వానియాక్రందన ధ్వనులాలించువారెవ్వరు? ఆలించిరక్షింప గలవారెవ్వరు? పాపమాయభాగ్యుఁడట్లే రోదించుచుండెను. "వీనినోట గుడ్డలుకుక్కుడు. వీనియఱపులంతరించును. అబ్బ! చెవులు గింగురుమను చున్నవి" అనియొక భటుఁడు ఖరస్వనము నఁబల్కినాఁడు. "అట్లుకాదు; వీనిరోదనధ్వనులందరు నాలింప వలయును. ఆలించి భయవిహ్వలులు కావలయును. అప్పుడిట్టి పల్కులుపల్క నింకెవ్వడు సాహసింపఁడు." అని యింకొకడు సమాధానమిచ్చినాఁడు రాజభటు లగునగునని యా దురదృష్ట వంతునీడ్చుకొనుచుఁబోయి కారాగారమునఁ బడవైచిరి. ఒడ లెల్లచీలుకొనిపోగా రక్తసిక్తాంగుడై హాహాకారములు సేయు చున్న యయ్యభాగ్యునిజూచి, ప్రజలు నిజముగానే భయచకితు లైరి. నోరువిప్పిన కారాగారము, కాలుకదిపిన కారాగారము, అబ్బ ఎంత యరాజకము! ఎంత చండశాసనము!

ఇట్లువారంతయు నల్లోల కల్లోలమై యుండగా, నూరిపె లుపల నామామిడి తోపులో నెవ్వరు చెప్పుమా, నిలిచి యున్నారు ?

ఓహో! యాచమనాయునింగారా! మహాపురుషా! ఏమిది? తమకుంగూడ మామిడితోపులో దాగియుండవలసిన దుర్దశపట్టెనదా? కదనరంగముల వీరవిహారము గావించు తమ శౌర్యమంతయు మొక్కవోయినదా? పాండ్యతుండీర నాథులం బరాజితులంగావించి బలాత్కారముగ చెఱగొన్న తమసాహస మంతరించినదా? గండుమీరిన మన్నెదొరలం గసిమసంగి, వాతే గాంద్రబందీలుగాంగొన్న తమ పౌరుషాతిశయముపలుచనైనదా? ఏమది? ఏద్దియో దీర్ఘాలోచనములో మునిగియున్నారే? ఉండుండి యాతురతతో నూరివైపే చూడ్కులు నిగిడించుచున్నారే. ఎవ్వరికొరకైన వేచియుండిరా? మహాశయా! అపరాధము! కార్యఖడ్గనిపుణులగు తమవంటి మహాత్ముల గభీరాశయముల గ్రహింప నేమెంతటివారము. క్షమింపుడు. ఎవరో తమవంకకే వచ్చుచున్నట్లున్నారు. తమ మేనమామగారి పుత్త్రిలుదామెర్ల రంగారాయణింగారివలె నున్నారు. ఇరువురును మహాయోధులు ఇరువురును రాజ్యతంత్రజ్ఞులు. ఈ యరాజకమంతరించు నుపాయము నూహింపుడు.

యాచమనాయనింగారి తల్లిగారు దామెర్లవారి యాడుపడుచు. మేనమామ మేనత్త బిడ్డలిరువురును జిన్ననాట తాతగారి యింటివద్దనే పెరిగిరి. ఇరువురును కుశాగ్రబుద్ధులే. కావుననే

శస్త్రమునందును శాస్త్రమునందు నసమాన కౌశలము నచిర కాలములో నేగడించిరి. రంగారాయణంగారుకేవలముగా యాచమ నాయనింగారి వద్దనే యుందురు. వారిద్దరకు శరీరములు మాత్రమే వేరు. ఆత్మలొక్కటే.

రంగరాయణంగారి రాకయే యాచమనాయనింగారు గమనింపలేదు.

రంగా:— బావా! ఏమంతదీర్ఘాలోచనము సేయుచున్నావు. వంశాంకుర మొక్కఁడైన మిగిలి యున్నాఁడుకదా! ఇంక విచారమేల? శ్రీరంగరాయల పుత్త్రుఁడగు రామరాయలనే సమ్రాట్టును గావింతము.

యాచ:— యాచమనీడు జీవించియుండఁగనే, రాజకుటుంబమున కిట్టి దుర్మరణము సంభవించినదే! ఇకనాతఁడు జీవించి యేమి ప్రయోజనము? నలుగురిలోనింక నాతఁడే మొగము పెట్టుకొని తిరుగగలఁడు? తంజాపురమువారి కేమని ప్రత్యుత్తర మీయగలఁడు?

రంగా:— ఇదేమి? బావా! ఇట్లనుచున్నావు. ఇందు నీ తప్పిదమేమున్నది. శ్రీరంగరాయలు నీమాటలన్నియుఁ జెవిని బెట్టినాఁడు. నీయుపదేశములలో నొక్కటియు నాచరణలోఁ బెట్టని యాతని నీవెట్లు రక్షింపగలవు? ఈ శత్రుమధ్యమున నుండుట ప్రమాదకరమని నీవు శతపోరి చెప్పలేదా! ఆతఁడు నీ మాటవినలేదు. తత్ఫల మనుభవించినాఁడు.

యామా:— అట్లనుకొని మనస్సు సమాధానపడుటకు వీలులేదు. ఆతఁడాంధ్ర కర్ణాటములకు చక్రవర్తి. ఆతని కషాయము వాటిల్లకుండ రక్షించుకొనుబాధ్యతమనది. ప్రజాకంటకుఁడైనప్పుడుతప్ప, తక్కినయెల్లవేళల నాతని శాసనము మనకు శిరసాధార్యమే. ఇంతెకు శ్రీరంగరాయలు నాయుపదేశముల దృణీకరింపలేదు. ఇందు మాకిద్దరకు నభిప్రాయ భేదము మాత్రమే కల్గినది. స్థానబలమే బలమని యాతఁడభిప్రాయ పడినాఁడు.

రంగా:— చక్రవర్తి చక్రవర్తి యని పలుమార్లనుచున్నావు. ఆతఁడింకను నభిషిక్తుఁడు కాలేదే.

యాచ:— వేంకటపతిరాయలేనాఁడాతనిని తన వారసుగా నిర్ణయించినాఁడో యానాఁడే యాతడు మనకు చక్రవర్తి.

రంగా:— "పాండవులందరు యుద్ధమున మరణించిన దో కుంతీదేవికైనను బట్టముగట్టెదనుగాని, రాజ్యము దుర్యోధనునకు దక్కనీయను" అని పూర్వము శ్రీకృష్ణుఁడు ప్రతిజ్ఞ పూనినాఁడఁట. ఇప్పుడు శ్రీరంగరాయాదులందరు నిజముగానే మరణించిరి కాని వారి వంశాంకురమొక్క బుడుతఁడు కలఁడు. కావున వానినే సామ్రాజ్యమున కభిషిక్తునిగావించెదనని నీవు ప్రతిన బూనినావు. బావా! నీకేల యింతపట్టుదల? ఎవ్వరు రాజైన మనకేమి ?

యాచ:— (పేరిపారఁజూచి) ఎందులకింత పట్టుదలయా? "దక్షులెవ్వారలుపేక్ష సేసిరది వారల చేటగు" నను భగవానుల వాక్యమును స్మరింపుము.

రంగా:— బావా! నీవు ధర్మసంస్థాపనార్థ మవతరించిన సాక్షాచ్చతుర్భుజుఁడవు.

ఇట్లు వారు ప్రసంగించుకొనుచుండగా నొకరజకుఁడు బట్టలకావడితో వారికడ కేతెంచెను. యాచమనాయనింగారి ముఖమున నాతురతద్విగుణీకృతమాయెను. రంగారాయణం గారి ముఖమున సంభ్రమాశ్చర్యములు తాండవించు చుండెను. కాని యెవ్వరును మాటాడలేదు. చాకలి త్వరలో బట్టలమూటలు విప్పినాఁడు. అందమూల్యములగు వస్త్రములెన్ని యోయున్నవి. అవి యన్నియు రాజయోగ్యములే, కాని చిత్రముగానున్నదే. ఆవస్త్రములమధ్యనొక పిల్లవాడణగి మణగి గుమ్మడిపండువలె ముడుచుకొని యున్నాఁడు. అతఁడు యాచమ నాయనింగారిని చూచినంతనే 'అప్పాజీ' అని గొంతుక్కకేకవైచి యాతని యొడిలో వ్రాలినాఁడు. ఆయనయు న్వాప్యాయముగ నాపిల్లవానిని దనహృదయమున కద్దుకొనినాఁడు. జాగుసేయక వారిర్వురు దరినేయున్న జవనాశ్వము నధిరోహించిరి. రంగా రాయణంగారు రజకునుచితరీతి బహూకరించి, తానునొక జవ నాశ్వమునధిరోహించి యూరివైపు మరలిరి. యాచమనాయనిం గారి తురంగమమును గదలినది. కొలది కాలములోనే వారా యూరి పరిసరములను దాటి, పూర్వసముద్రతీరమువైపు పయనము సాగించుచుండిరి.

## ఆరవ ప్రకరణము.

“భటాగ్రణీ! మన బలపరాక్రమము లీయూరివారికి విశదములైనవా?” అని యొకనాటి మధ్యాహ్న సమయమునఁ గృష్ణభూపతి, తనముందు చేతులు జోడించుకొని వంగినిలిచి యున్న యొకసేవకుని బ్రశ్నించినాఁడు.

“చిత్తము మహాప్రభూ! సంపూర్ణముగా విశదమైనవి”.

కృష్ణ:— (గంభీరముగా) ఎట్లువిశదమైనవిరా మూర్ఖా?

భటు:— తమరు సదా ధరించుదీర్ఘ కరవాలమే తమపరాక్రమాతిశయమును వేనోళ్ల చాటుచున్నది ప్రభూ!

కృష్ణ:— ఏమి? మనము ధరించు కరవాలమును బట్టియా వారీ విషయము గ్రహించిరి. మనమేనాఁడు దాని నుపయోగించితిమో యెఱుంగమని యామూర్ఖులకు దెలియదా?

భటు:— ఉపయోగింప నక్కఱ లేదు మహాప్రభూ! అసలట్లు ప్రయోగింపకపోవుటయే తమ పరాక్రమమునకు ప్రబల నిదర్శనమని వారియూహ.

కృష్ణ:— ఎట్లు? వివరించి చెప్పుము.

భటు:— తమరుగ్రనరసింహులనియుఁ ‘గరవాలములు గిరవాలములు తమ కనావశ్యములనియు వారి యభిప్రాయము.

కృష్ణ:— శెబాష్? నిజమైన తెలివితేటలట్లుండవలయును. ముస్తు నీరప్ప వట్టి పిరికిపంద సుమా!

భటు:— నిజము మహాప్రభూ! నిజము. వీరపసీడు వచ్చి పిరికి పంద.

కృష్ణ:— అదినీకెట్లు తెలిసినది?

భటు:— తమరిప్పుడే సెలవిచ్చిరికదా ప్రభూ!

కృష్ణ:— ఛీ మూర్ఖా! మేమెవ్వరికి సెలవిచ్చితిమా! మనవి చేసితిరనుము.

భటు:— అట్లనవచ్చునా ప్రభూ!

కృష్ణ:— (గుడ్లెఱ్ఱగాఁజేసి) మా మాటకెదురు చెప్పు చున్నావురా పశువా! (తన్నును)

భటు:— చిత్తము మహారాజా! తమమాట కింకెన్నడు నెదురు చెప్పను.

కృష్ణ:— చెవులు నులిపికొనుము.

భటు:— అట్లే మహారాజా! (నులిపికొనును)

కృష్ణ:— (నవ్వు మొగముతో) భటాగ్రణీ!

భటు:— చిత్తము మహాప్రభూ!

కృష్ణ:— మేము మహామూర్ఖులమని యీ యూరిలో కొందరనుకొను చున్నారఁట నిజమేనా?

భటు:— నిజమే మహాప్రభూ!

కృష్ణ:— (గంభీరముగా) ఎందువలన?

భటు:— వారు మహామూర్ఖులగుటవలన.

కృష్ణ:— శెబాస్! నీ తెలివితేటలు మాకు నచ్చినవి. ఇదిగో యీ రత్నాంగుళీయకమును బహూకరించుచున్నాము. తీసికొనుము (సేవకుఁడు రత్నాంగుళీయకమును గైకొని మరియు వినమ్రుఁడై నిలిచియుండును)

కృష్ణ:— ముత్తు వీరప్ప కేవల వేశ్యా ప్రియుఁడనుసుమా!

భటు:— ఔను మహాప్రభూ.

కృష్ణ:— మనవలె వీరోచిత కృత్యములా చరింపలేఁడు.

భటు:— నిజము మహాప్రభూ! వాని వీరము నామ మాత్రమే.

కృష్ణ:— మరి మన వీరమో!

భటు:— నామరూపరహితము మహాప్రభూ!

కృష్ణ:— అనగా?

భటు:— పరమేశ్వరుఁడు నామరూప రహితుఁడుకదా! తమ వీరముగూడ నామరూపరహితమే. పరమేశ్వరుఁడెవ్వరికి గానరాఁడు. తమవీరము నెవ్వరికి గానరాదు.

కృష్ణ:— శెబాస్! నీవ్యాఖ్య ప్రశంసార్హము, అయిన మనము పాండ్యదేశముపై నేల దాడి వెడలరాదు ?

భటు:— అంతవరకేల మహాప్రభూ! మళయాళ మాంత్రికుఁడిచ్చిన యోషధియున్నదికదా! దానిని ప్రయోగించి...

కృష్ణ:— అక్కడే చిక్కు వచ్చినది. ఆమాంత్రికహంతే కూడా యోషధీ చూర్ణమును గొలదిపాటి మాత్రమే యిచ్చి నాడు. దానినాజగ్గరాజ హంతకునకీయక తప్పినదికాదు. తుదకు మన వద్ద నాచూర్ణము రవంతయు లేదు.

భటు:— పోనిండు; ఆమాంత్రికు నడిగి మరల నాచూర్ణ మును సంపాదింతము.

కృష్ణ:— (వెడనవ్వునవ్వి) ఇంకెక్కడి మాంత్రికుడు ఆతని నానాడే పరిష్కరించినాము. (మరల నొక వెడనవ్వునవ్వి) కృష్ణభూపతి మూర్ఖుడు కాడురా! ఈమాంత్రికుల నమ్మరాదు. ఈనాడు మనకిచ్చిన విషచూర్ణము రేపాతడు మనశత్రు రాజునకీయవచ్చును. అప్పుడు మనకేమి గతి? కావున నట్టి ప్రమాదకరుడగు మనుష్యుడీ భూమండలమున నుండరాదని వానిని వెంటనే పరలోకమున కంపినాము (మరలవికటముగనవ్వి) మాబుద్ధి నైశిత్యము నీకిప్పుడు విశదమైనదా!

భటు:— విశదమైనది మహాప్రభూ! విశదమైనది కాని—

కృష్ణ:— కాని—ఊఁ! నీ యనుమానమేమో త్వరగా చెప్పుము.

భటు:— దాడి వెడలుటకు బుద్ధినైశిత్యముతోపాటు బాహు బలముకూడ నావశ్యకము మహాప్రభూ!

కృష్ణ:— ఓహో! నీవు మాబాహుబలమును శంకించు చుంటివా? (సోఫానుండిలేచి) రమ్ము మనమిర్వురమును మల్ల

యుద్ధమొనరింతము. అప్పుడు గాని మాబాహు బలము నీకు నిశదము కాదు.

భటుః— (గడ గడ వడకుచు) అపరాధము ప్రభూ! అపరాధము. ఈసేవకుఁడు కృష్ణభూపతుల బాహు పరాక్రమము శంకించునంతటివాడా!

కృష్ణః— (చిరునవ్వు మోముతో) భయము వలదు. సేవకాగ్రణీ! భయమువలదు. మనమిద్దరము నీనాడు మల్లులవలె నొకంతసేపు పోరాడుదము. ఇదిమాచిద్విలాసము. మాయాజ్ఞ.

సేవకునకింక గత్యంతరములేదు. రాజాజ్ఞ యనుల్లంఘనీయము నవశ్యకర్తవ్యమునుగదా! కృష్ణభూపతియు నింతదనుక దనకు వలెవాటుగా నున్న వస్త్రమును దీసివైచినాఁడు. ఆహా! ఆరూపము వర్ణనాతీతము. కృష్ణభూపతి మరుగుజ్జుకాఁడు. కాని యాతని నవమించుక నంగీయుండుటచే నాతనిని గూని రాజుగారని కొందరు దుండగీండ్రు పిలుచుచుందురు. ఆతనికాలు సేతులుబూచ్ఛలపలె నున్నను నాతని పొట్టమాత్రము భాండము వలెనిండుగా కన్నుల పండువుగా నుండును. ఎవ్వరో కిట్టనివారాతని పొట్టనుజూచి యాతనికి కుండోదరుఁడని నామకరణము గావించిరఁట. కాని యది సర్వథాయంగీకరింపఁ దగినదికాదు. కుండోదరునకు నీయనకు నొక్క—పొట్ట విషయమున సామ్యముండిననుండ వచ్చును గాని, యాతనివలెనీతఁడు లేనిపోని విచిత్ర చర్యలకుఁబోయిన వాఁడు కాడని మేము నొక్కి— వక్కాణింపగలము. ఇంకనాతని తలబొత్తిగాచిన్నదని కొందరి వాదన.

కానిండు ఆతని కన్నులు చిన్నవికావా? చెవులు చిన్నవికావా? నుదురు చిన్నదికాదా? కావున నివియన్నియుఁజిన్న వైనప్పుడు తలమాత్రము పెద్దదెట్లగును? కాని యాతని నాసికా రంధ్రములు పెద్దవి. కొందరు మూర్ఖులది బొజ్జముక్కనినను మేమద్దాని నంగీకరింపము. ఆతనికి వెడదయురము లేకున్న నేమాయె! వెడద నోరుకలదుకదా! కృష్ణభూపతుల దేహచ్ఛాయ విషయమునను నభిప్రాయభేదమేకలదు. అది మసిబొగ్గువంటి నల్లనిచాయ యని కొందరిమతము. ఇంద్రనీలమణుల నేలిచాయయని కొందరి మతము. మేమా విషయమును గూర్చి యెంత విచారించినను నొక నిశ్చితాభిప్రాయమునకు రాలేకపోయినాము. ఏదియెట్లున్నను మేము ప్రప్రథమమునఁ జెప్పినమాట సర్వథాసత్యము. వారిరూపము వర్ణనాతీతము. అవాఙ్మానసగోచరము.

ఇక సేవకునివిషయ మించుక పరిశీలింతము. ఆతఁడు కేవల సేవక మాత్రుఁడుకాఁడు. పరదేశములలో నున్నప్పుడు కృష్ణ భూపతికి కాతఁడేనర్మసచివుఁడు; సచివుడు, సామంతుఁడు, దండ నాథుడు. వేయేల ఆసేవకుఁడు చెంతలేకున్నచో నాభూపతి రెండునిముసము లోర్వజాలరు. ప్రభుచిత్తమును గ్రహించి మెలంగుటలో నాసేవకుఁడు మేటి.

రాజుగారు భుజమప్పళించి నిలిచినారు. సేవకుఁడును భుజమప్పళించినాఁడు. ఇరువురును నిజమగు మల్లులవలెనే చుట్టు తిరుగుచున్నారు. తీక్ష్ణములగు చూడ్కులు నొండొరులఁజూచు చున్నారు. క్షణములో రాజుగారు సేవకునిపైఁబడి యాతని

నడుము పట్టుపట్టిరి. సేవకుఁడవి త్రుటిదిలో వదిలించుకొనినాఁడు. రాజుగారిని సీసాపట్టుపట్టినాఁడు. రాజుగారుక్కిరి బిక్కిరియగు చున్నాఁడు. నిజముగా సేవకుఁడు బలశాలి, కాని గడసరి. రాజుగారి యవస్థను గ్రహించినాఁడు. పట్టువదలినాఁడు. భూపతి విజృంభించి సేవకుని క్రింద పడద్రోసినాఁడు. ఇద్దరును గ్రిందు మీఁదగు చున్నారు. కృష్ణభూపతి బూబోసికొనుచున్నాఁడు. సేవకుఁడోడినట్టు నటించినాడు. తనకుఁదానే వెల్లకిలఁబడినాఁడు. రాజుగారాతని దృఢవిశాల వక్షముపైఁదన యూఁచచేతుల నానించి, బూబోసికొనుచు, మాబాహు బలము రుచిచూచి తివా! అని యరచినారు. సేవకుఁడు హీనస్వరముతో చూచి నాను మహాప్రభూ! తమ బలపరాక్రమములనంతములు. అజయ్యములు. క్షుద్రసేవకుఁడను రక్షింపుఁడు. ప్రాణభిక్ష" అని పల్కుచు కన్నులనీరు నించినాఁడు. రాజుగారుబ్బితబ్బిబ్బయి నారు. సేవకుని వీడి రెుుక్క యెదుటున సోఫాపైవ్రాలినారు. సేవకుఁడు వెంటనే లేచి, యొకవీవనగైకొని విసర మొదలిడినాడు. కృష్ణభూపతి యొకింత దేరుకొనినాఁడు. సేవకుడిచ్చిన పానీయ మును గ్రోలినాఁడు. ముఖము సంపూర్ణముగ వికసించినది. చిఱునవ్వు మోమునఁజిందులు ద్రొక్కుచుండగా భటునిట్లు ప్రశ్నించినాఁడు.

కృష్ణః— భటాగ్రణీ!

భటుః— చిత్తము మహాప్రభూ!

కృష్ణః— మన యిప్పటి ప్రవర్తన మెట్టున్నదని నీయభిప్రాయము.

భటు:- వీరోచితముగ — మ హా వీ రో చి త ము గ నున్నది ప్రభూ!

కృష్ణ :- సెబాస్! నీవు నిజముగా తెలివిగలవాఁడవు. ఆహావరంగములలో మహావీరులు శరణన్నవారికెట్లు ప్రాణభిక్షు పెట్టుదురఁట. నిజమేనా?

భటు : నిజమే మహాప్రభూ! ముమ్మాటికి నిజము. ప్రభువులకు తెలియని దేమున్నది.

అంతట రాజుగారి దృష్టి యనతిదూరముననే యున్న యాయుధా గారముపైఁబడినది. అది యాయుధాగారమని యాయనకింతపరకు తెలియదు. అసలాయుధములే యక్కఱలేని వానికాపరిశీల్తి యనావశ్యకముకదా! మఱియు న్యాయాగారము చూచుటకొక దేవాలయము వలెనున్నది. శత్రుసేనల మోసగించుటకై యాకట్టడము నట్లుకట్టినారు. ఆమర్మము తెలుంగని భూపతి భటునిట్లు ప్రశ్నించినాఁడు.

“సేనాపతీ! ఆకానవచ్చు దేవాలయ మెవ్వరిది? రామునిదా? కృష్ణునిదా?”

భటు : అది దే వా ల య ము కా దు ప్రభూ! ఆయుధా గారము.

కృష్ణ : (విస్మయ విస్ఫారిత నేత్రములతో) అయుధా గారమా? అందేమియుండును?

భటు : సునిశితదీర్ఘకరవాలములు, ఈటెలు, బాకులు, మొదలగునవి యుండును. మరియు, పేర్వడసిన పూర్వమహావీరుల యాయుధములు నందు నిక్షిప్తములై యుండును.

కృష్ణ : ఏమి? పూర్వమహావీరులా! వేలుమడిచి యొక్క పేరు చెప్పుము ?

భటు : (వేలుమడిచి) ఒకటి శ్రీకృష్ణదేవరాయల వారు. రెండు, వీరనరసింహరాయలవారు, మూడు రామరాజులవారు, నాలుగు విశ్వనాథనాయకుంగారు.

కృష్ణ : విశ్వనాథనాయని యాయుధమునుగలదా? అయిన మన మొక్క మారా యాయుధాగారమును చూడవలయును. ఈరోజుననే ఇప్పుడే ముత్తు వీరప్పకు కబురంపుము.

భటు : తమకిది వృథాప్రయాసము ప్రభూ! తుప్పుపట్టినయాపూర్వుల యాయుధములు చూచిననేమి? చూడకున్ననేమి?

కృష్ణ : (గంభీరముగా) ఇది మాయాజ్ఞ; మాచిద్విలాసము.

భటు : చిత్తము మహాప్రభూ!

కృష్ణ : అట్లయిన జవనాశ్వములు పూంచిన శకటమును రావింపుము.

భటు : చిత్తము. ఏలినవారి యాజ్ఞ.

ఇట్లు రాజుగారు భట్టునితో సంభాషించుచుండగా ముత్తు వీరప్పయే యచ్చటికి వచ్చెను. కృష్ణభూపతి యాతనిం గాంచినంతనే లేనియానందమును దెచ్చికొనుచు, "బావగారు! మంచి సమయముననే వచ్చినారు, దీర్ఘాయుష్యమస్తు" అని పలుకరించెను.

ముత్తువీ:— ఇప్పటివరకు వీరపనీడసమయమున నెవ్వరి కడకును బోయియెఱుఁగడు. కాని యేమిటికథ?

కృష్ణ: ఏమియును లేదు. మనమాయుధాగారమును జూడవలయును. ఆప్రియాణ సన్నాహములో మేముండగనే మీరువచ్చిరి.

ముత్తువీ:— (ఆశ్చర్యపడి) ఆయుధాగారమా! దానితో మీకేమి పని?

కృష్ణ:— అందున్న యాయుధముల నేము పరీక్షింపఁ దలఁచినాము. ఏమి సేవక చంద్రమా!

సేవ:— చిత్తము మహాప్రభూ!

ముత్తువీ:— అవి మహావీరుల్ల యాయుధములు.

కృష్ణ:— మనముమాత్రము వీరులము కామా?

ముత్తువీ:— కావచ్చును కాని వారి బలపరాక్రమము లతిలోక సామాన్యములు.

కృష్ణ:— మా బలపరాక్రమము లతిలోక మహాలోక సామాన్యములు సేవక చంద్రమా! మనమిప్పుడే గావించిన మహాయుద్ధమును గూర్చి వీరప్పగారి కుపన్యసింపుము?

ముత్తువీ:— (సేవకుని వైపు తిరిగి) ఏమది? బావగారిప్పు డెవ్వరితో యుద్ధమొనరించిరి?

సేవ:— ఏమియును లేదు ప్రభూ! ప్రభువులు విలాసార్థముగా నాతో మల్లయుద్ధముగావించిరి.

ముత్తు వీ:— (ఆశ్చర్యముతో) ఇది నిజమా?

కృష్ణ:— నిజమే. ఇందసత్యమున కేమున్నది. మేమును మా సేవకాగ్రణియుఁగొంత కాలము మల్లులవలె పోరినాము.

ముత్తు వీ:— (చీదరించుకొనుచు) పిల్లులవలె కాదా!

కృష్ణ.— కాదు గండుపిల్లులవలె.

సేవ:— కాదు భిల్లులవలె.

ముువ్వురును నవ్వుకొనినారు. తరువాత ముువ్వురు నాయుధాగారమునకు బయలుదేరిరి. ముత్తు వీరప్పనాయుడు సుందరుఁడు. రాచఠీవి కలవాఁడు. మహావీరుఁడు కాకపోయినను పిరికిపంద కాడు. కాని కేవల భోగపరాయణుఁడు. స్త్రీలోలుఁడు. ఆతనికి కృష్ణభూపతియెడ సుహృద్భావమిసుమంతయును లేదు. కాని రఘునాథరాయలయెడ నాతనిగల శత్రుత్వమే కృష్ణ భూపతినాతని మిత్రకోటిలో చేర్చినది. క్షణకాలములో వారు ముువ్వురు నాయుధాగారమును చేరిరి; కావలి కాయుచున్న భటుఁడొకఁడు ముందుకువచ్చి తోవచూపగా లోనికేగిరి. అందువీరాధి వీరుల యాయుధములన్నియు వరుసలుదీర్చి యమర్పఁబడి యున్నవి. సేవకుఁడొక్కొక్కదానిని గూర్చి యుపన్యసించుచుండెను.

సేన: ఈ సునిశిత దీర్ఘకరవాలమును శ్రీకృష్ణదేవ రాయలవారాహవరంగమున నుపయోగించెడివారు. ఈ ఖడ్గ మును చేతంబూని వారు తురంగమము నధిరోహించినచో నాయన నెదుర్కొ-నంది నేతుసకుంగూడ నలవికాకుండెడినంట వారు ఖడ్గపాణులైనచో నకులుండు కత్తిపట్టినట్లే.

ముత్తు. వీ: వారు నిస్సందేహముగ నింతటిపరాక్రమము గలవారే. కావుననే విశ్వనాథనాయనింగారి బలపరాక్రమముల దృటిలో గ్రహింపగలిగిరి.

సేన: ఈ భల్లమును రామరాయలవారుపయోగించెడి వారంట. ఈనాడు దీనినొంటిగా, అన్యసాహాయ్యానిరపేక్షముగా నెత్తగల వారే లేరు.

ముత్తు వీ: ఆనాటి బలము లేడ? ఈనాటి బలము లేడ? రెండిటికిని హస్తిమశకాంతరము కలదు.

కృష్ణ: ఎవ్వారు నెత్తలేరా? అయినచో వారుమాత్రము దీసి నెత్తగలిగిరి. ఎత్తినను నెట్లుపయోగింప గలిగిరి? మేము నీమాటల నమ్మజాలము,

ముత్తు. వీ: నమ్మినను నమ్మకపోయినను, వీని నెత్తుట మాత్రము పెద్ద బండిసున్నయే.

కృష్ణ: హు! వీరప్పనాయనిగారి బలమింతేనా? ఏమో అనుకొంటిని? చూడుడు నాబాహుబలము ఈ యాయుధముల నవలీల గ్రహించి, గిరగిర త్రిప్పెదను.

ముత్తు. వీ: ఖానగారూ! సాహసము వలదు. వీనితోడి సంయోగము పాములతోడి చెలగాటము.

కృష్ణ: చూచెదగాక! క్షణకాల మోపిక పట్టుఁడు.

ముత్తు వీరప్పకు తన బలము తెలియును. కావుననే యాయుధముల జోలికిబోలేదు. కృష్ణభూపతి ముందడుగు వైచి, రామరాయల భల్లమును గ్రహింపఁబోయినాఁడు. తాళ ప్రమాణమగు నాభల్లమును గదలింపబోగా హస్తమించుక జారినది. ఆయూపున కాగలేక యాతఁడు క్రిందపడినాఁడు. ఆయుధమాతనిపైఁబడినది. పాపము రాజుగారుక్కిరి బిక్కిరి యగుచుండిరి. క్షణకాల మూరకున్నచో నాయన పరలోకము నాశ్రయింపవలసినవాఁడే. కాని భటుఁడు త్వరితగతి నేతెంచి, వీరపనాయని సాహాయ్యముతో నమ్మహాభల్లమునుదీసి యథాస్థానమున నుంచినాఁడు. కాని భూపతి యద్దాని నవమానకరముగ భావించినాఁడు. దుర్జనులుసత్కృతిని గూడనపకృతిగానే భావింతురుకదా! అంతలో కృష్ణభూపతి కాయుధముల వలని వ్యామోహము తీరినది. వెంటనే మువ్వురు నీవలికి వచ్చిరి. కావలివాఁడు మాత్రమందేయుండి వారొకించుక దూరమేగినంతనే యొక్క నవ్వునవ్వి హేళన పూర్వకముగా నిట్లు పలికినాఁడు. "ఏమిరాజులు! శస్త్రమును బట్టజాలని చవటరాజులు. రాజనగా రఘునాథుఁడొక్కఁడే. మొన్ననీ భల్లము నవలీలగాఁద్రిప్పినాఁడు."

## ఏడవ ప్రకరణము.

రాత్రి మూఁడుజాములుమాత్రమే గతించినవి. చంద్రుఁ నునుగాంతివెల్లువలలో జగమంతయుఁ దానమాడుచునే యున్నది. రేరాజు దాడికి వెరచి చీకటులు గిరిగుహాంతరముల డాగినవి. సాంద్రారణ్యములలో సంచరింపఁదొడగినవి. అట్టి రాజద్రోహుల కాశ్రయమిచ్చిన నిబిడారణ్యము తంజాపురీ రాష్ట్రమున నొకటికలదు.

అందున్న మహావృక్షములు కొన్ని యభ్రంకషములు. కొన్ని స్వీయశాఖాక్రమిత దశదిశాంతరాళములు. కొన్ని నిబిడ నీరంధ్రజలధరమాలికాసదృశములు. కొన్ని సహస్ర ఫణామండల మండిత మహా భుజంగమ తుల్యములు. కొన్ని మనోజ్ఞ కుసుమగుచ్ఛసముపేతములు. కొన్ని నిశిత కంటకమయములు. అమ్మహారణ్యము శార్దూలాది క్రూరసత్వముల కాలవాలమగుట చేనందుఁ బ్రయాణము సేయఁబట్టనగ లైనను నందరు వెరతురు. మరియు నయ్యది భయంకరులగు చోరులకును హంతకులకును నావాసభూమియను నొకకింవదంతి గలదు. కావున నిందు సాధారణముగ నొంటరిగ నెవ్వరును సంచరింపరు.

అట్టి భయంకరారణ్యమున నారాత్రి సమయమున, నొంటరిగ నొక యాశ్వికుఁడు పయనము సేయుచుండెను. నిశిత కంటక శిలావృతమును, నిమ్నోన్నతమునగు నయ్యరణ్య ప్రదేశమున నాతఁడు బహుకష్టముపైఁ దన యశ్వరాజమును నడిపించుకొనుచుండెను. అందందు మార్గము నడ్డగించుచున్న తరు

లతా సంతానముల ఖండించుకొనుచు దనయెడిలో నిద్దురపోవు చున్న యొకబాలుని రక్షించుకొనుచు, నాతఁడు మెల్లఁగా బోవుచుండెను. కాని మన యాశ్వికుని పయనమున కంతరాయ ములు కలుగకపోలేదు. అనతిదూరముననే యొక వ్యాఘ్రము యాక్రమించి భయంకరముగ నరచుచు వానిపైకే తెంచుచుండెను. అశ్వికుఁడు చలింపలేదు. వాడిభల్లము గైకొని చేతికొలది విస రెను. వ్యాఘ్రము పెనుబొబ్బలిడుచు నేలఁగూలెను. ఆ బెబ్బులి యరపులకు బాలుడు మేల్కాంచెను. మరల మన యాశ్వికుఁడు పయనము సాగించుచుండెను. అప్పటికప్పుడే చంద్రుడస్తగిరి మాటున కేగెను. కాలాంజనమలందినట్లు జగమంతయుఁ జిట్ట చీకటి గ్రమ్మెను. అప్పుడిరువంకల గొండలుగల యొక యిరుకు త్రోవనుబట్టి యమ్మహాపురుషుఁ డేగుచుండెను. దగ్గరనే యెద్దియో సవ్వడి వినవచ్చెను. అశ్వముకూడఁ జెవులుఁరిక్కించి నిలిచి, ముందడుగు వేయ లేదు. మనవీరుఁడు నలువంకలఁ బరి శీలించినాఁడు. ఎందును నేమియుఁ గానరాలేదు. మరల నశ్వము నడాయించినాఁడు. తురగమొకటి రెండడుగులు ముందునకు వేసినది. మరలనేదో యీల వినవచ్చినది. మనవీరుని ముఖ మండలమున నరుణకాంతులు గోచరించినవి. వలపలచేయి, మొలపై వ్రేలాడుచున్న భీకర కరవాలమును స్పృశించినది. ఆతఁడా కొండలవైపొక్కసారి తన నిశితవీక్షణములఁ బరపినాడు. ఆతని యూహ సత్యమేయైనది. నడగొండలవంటి మనుష్యులు బిరబిర నాతనివంకకే యేతెంచుచుండిరి. వారిచేతులలో మృత్యు జిహ్వాకరాళములగు భయంకర ఖడ్గములు తళతళ మెరయు

చుండెను. కాఱునలుపుగల మేనులతో, కొంపంట్లతో, మిడి గ్రుడ్లతో, జుంజురు వెండ్రుకలతో, వారత్యంత భీకరదర్శనులై యుండిరి. క్షణకాలములో వారందరు నట్టహాసములు గావించుచు, నమ్మహావీరునిఁ జుట్టుముట్టిరి. మనయోధుఁ డిసుమంతయు జలింపలేదు. ఒక్క సింహగర్జనము గావించి యొఱమన్న ఖడ్గ రాజము నీవలకు ఛఱ్ఱుమని లాగినాడు. మఱుక్షణముననే, ఖణిల్లు ఖణిల్లుమను శబ్దము లమ్మహారణ్య మందంతటఁ బ్రతి ధ్వను లీనుచున్నవి. యశ్వరాజమును రణరంగ విహారమున నారితేరినది. జంకుగొంకులులేక తన్ను జుట్టుముట్టిన వారిపై కురుకుచున్నది. కఠోరఖురపుట ప్రహారములచేఁ గొందర నల యించుచున్నది. కొందరఁ జంపుచున్నది. ఇఁక మనయోధుని విశృంఖల వీరవిహారమును వర్ణింప వాగ్వధూటికైన నలవికాదు. మొదటి యురుకుననే మువ్వురు ఘాతుకులాతని కత్తికి బలియైరి. ఆ ఖడ్గచాలన నైపుణ్య మనుపమానము. ఆ ధైర్యసాహసము లప్రతిమానములు; ఆ రణరంగ విహారకౌశలమతిలోక సామా న్యము. కొందరి మస్తిష్కములు ద్రాటిపుచ్చెలవలె నెగురవేసి నాడు. కొందరికాలు సేతుఖండించి కబంధులఁ గావించినాడు. కొందరి యురస్థలమును దఱిచ్చి చిందరవందర గావించినాఁడు. కొందరి కంఠనాళములఁ దెగగోసినాఁడు. గొందరి బలితంపుఁ బోటులచే రుధిర ధారాసిక్త సర్వాంగులఁ గావించినాఁడు. బాలుఁడు మాత్ర మూరకుండెనా? సింహకిశోరమువలె విజృం భించి యనేకుల మడియించినాఁడు. కాని యేమిప్రయోజనము? ఘాతుకులు తండోప తండములుగ నేలయీనినట్లు వచ్చిపడు

చున్నారు. నిశితాయుధములచే యోధుని నొంచుచున్నారు. వికటాట్టహాసములతో విజృంభించుచున్నారు.

ఇట్లాయుద్ధ మెంతకాలము నడిచెనో మేము సరిగా చెప్ప జాలము. యోధుని శరీరమంతయు రక్తసిక్తమైనది. నిరంతర ధారాపాతముగా రుధిరము స్రవించుచున్నది. బాలునకును నచ్చ టచ్చట చిన్న చిన్న దెబ్బలు తగిలినవి. ఆతని యుడుపులును రక్తసిక్తములైనవి. క్రమక్రమముగా మనవీరుని బలము క్షీణించు చున్నది. కాని యాతఁడు ఖడ్గచాలనమును గావించుచునే యున్నాఁడు. ఇంతలో దూరమునుండి "వచ్చుచున్నాము. భయము వలదు." అను కేకలు వినవచ్చినవి. క్షణకాలము లోనే యిర్వురాశ్వికులు నిశిత కృపాణుపాణులై యాహవరంగ మునఁ బ్రవేశించి, సోకుమూకలవలె చెలరేగుచున్న యా ఘాతుకులఁ జించి చెండాడ దొడగిరి. ఎప్పుడు వారి ఖడ్గము లెవ్వరిపైఁబడునో పాపమా చోరులకు తెలియరాకుండెను. కొందరు పలాయన మంత్రము గావింప యత్నించిరి. కాని ప్రయోజనము లేకపోయెను. ఆ బాలవీరు లిర్వురు నిరువంకలఁ గాఁచి వీరవిహారముఁ గావించుచుండిరి. మనయోధుఁడును శక్తి వంచన లేకుండ సంహారకాండమును సాగించుచునే యున్నాడు.

అరుణోదయ మగుచున్నది. శత్రువులందరు నిశ్శేష ముగా మడసిరి. బాలవీరు లిర్వురును దమకృపాణముల నొరలో నిడిరి. మనయోధున కించుక విశ్రాంతిచేకూరినది. ఆతఁడు తన యెట్టయెదుట ధవళాశ్వముల నధిరోహించియున్న బాలవీరులఁ జూచినాఁడు. వారును వినయవినమిత శిరస్కులైయమ్మహావీరు

నకు నమస్కరించిరి. మన యోధునకు వారిని చూచినంతనే, యపరిమితమగు వాత్సల్యము గల్గినది. ఆశ్చర్యము గల్గినది. గౌరవముగల్గినది; ఆతఁడు వారి నాశీర్వదించినాఁడు. కాని వారె వ్వరో యాతనికి గుర్తువచ్చినదికాదు. ఎవ్వరైననేమి ? తన్ను మహాపదనుండి రక్షించినారు. సంభావ్యులు.

యోధు :- అయాచితముగ మాకిట్లు మహోపకృతి గావించిన మిమ్మెట్లు సంభావింపవలయునో నాకు తెలియకున్నది. నన్ను విపత్సముద్రమునుండి యుద్ధరింప నేతెంచిన శ్రీరామ లక్ష్మణులుగా మిమ్ము నేను భావించుచున్నాను.

బాలవీరులు :- జగదేక వీరులగు యాచమానాయనిం గారి ప్రశంసకు పాత్రులమగుట మాకు నిజముగా గర్వకారణ మేకాని మేము మీకు గావించిన యుపకృతి యేమియును లేదు. నిరంతర ధర్మరక్షణ పరాయణులగు తాము మిమ్మాశీర్వ దించుటయే యుక్తమగు సన్మానము.

యాచ :- (ఆశ్చర్యచకితుఁడై) మీ మాటలనుబట్టి చూచినచో, మీకు నేను కేవల మపరిచితుఁడను గానని తోఁచు చున్నది. కాని యెంతయోచించినను మిమ్ము నే నెచ్చటఁ జూచితినో జ్ఞప్తికి రాకున్నది,

బాల వీ :- మహాశయా ! దశదిశా విశ్రాంత యశ స్సాంద్రులగు యాచమనాయనింగారినే యెఱుంగనీ మూర్ఖు లుందురా ? మీరు మమ్మెఱుఁగరు. మాకు మాత్రము మీరు నుపరిచితులే.

యాచ :- సజ్జనులగు వారికి గోరంత మంచియున్న కొండంతగా వర్ణించుట యభ్యాసము. మీరు నిజముగా సజ్జనులు. కావుననే స్వల్పుడనైనను నన్నిట్లు బహూకరించి పల్కుచున్నారు. దానికేమి లెండు. మీరిద్దరును నాకు గావించిన యుపకృతి మరువరానిది. నాకేకాదు. ఈ విశాలాంధ్ర కర్ణాట సామ్రాజ్యమునకే మీరుపకృతి గావించినారు. కావున మీరిద్దరు నావెంట రావలయును. చిరంజీవి మా రఘునాథునకు మిమ్ము చూపవలెనని నా కోర్కె. నా యందెద్దియైన గుణలేశము మీకు గన్పట్టినచో, నాయీ ప్రార్థనమును మీరు మన్నింపవలయును.

బాల వీ :- తామిట్లు పల్కుట పాడికాదు. తమవంటి మహనీయులు మమ్మాజ్ఞాపించుట యుక్తముగాని ప్రార్థించుట భావ్యమా. మేమెల్లవేళల మీ యాజ్ఞకు బద్ధులమే. కాని యిప్పుడు మేము కొండొకకార్యమును సాధింపనేగుచున్నాము. కొలది దినములలోనే, తిరిగివత్తుము. అప్పుడు తప్పక తంజావురికేతెంచి, తమ దర్శనభాగ్యముచే ద్విగుణీకృతోత్సాహులైయున్న రఘునాథరాయుల వారిని సందర్శింపగలము. వారికి మేముసుపరిచితులమే. మాకు వారును సుపరిచితులే.

యాచ:- ఏమి? రఘునాథునితోడి పరిచయము మీకు గలదా? అయినమరియు మేలాయె. తప్పక విచ్చేయుదురు కదా!

బాల. వీ:- తప్పక; మహాశయా! మాకింకననుజ్ఞ యిచ్చెదరా! పోయి వచ్చెదము.

యాచ:— మంచిది; పోయిరండు. ఆఁ! మరచినాను, రఘునాథుఁడు మీకు సుపరిచితుఁడే యంటిరి. ఆతనికి మీరంపు సందేశార్థము లెవ్వియైనఁగలవా?

బాల, వీ:— ఒకటి రెండుకలవు. చోళగుని యాశ్రమమున, తత్కృతాతిథ్యమును స్వీకరింపవలదని రఘునాథరాయల వారి నెవ్వరు నిరోధించిరో, వారాతని కీనాఁడు తమధన్య వాదములు సమర్పించుకొను చున్నారని, రాయలవారి కెఱింగింపుఁడు.

యాచ: చోళగుని యాశ్రమమా! అందులకు రఘునాథుఁడేల పోయెను.

బాల, వీ: అదియొక చిత్రగాథ, దాని యానుపానులు వారికే తెలియును.

యాచ:— సరే; అట్లే చెప్పెదను. మీరింక పోయిరండు.

అప్పటికే బాలభానుఁడుదయగిరి శిఖరముపై నధిరోహించినాఁడు. చివురు పసిండికాంతుల నీనుచు నాతని కిరణజాలము బ్రహ్మాండమంతియు నాక్రమించినవి. ఆ తేజఃపుంజమా కారడవిని గూడఁజీల్చుకొని లోనికి పోయినది. అప్పుడు యాచమ నాయనింగారికి, బాలవీరుల ముఖమండలములు విస్పష్టముగాగోచరించినవి. ఆ ప్రభాతారుణకాంతులలో నయ్యావిస్ఫురదరవింద ప్రభా భాసురములై, నిరంతర లక్ష్మీనివాసస్థానములై యొప్పారినవి. కాని యందలి కోమలత్వమే యాతని కచ్చెరువు గొల్పినది. ఆయన నలువంకలఁగలయఁజూచెను. మడువులు గట్టిన రుధిరముతో, ఛిన్నభిన్నములై యున్న

మనుష్య కళేబరములతో, మాంసఖండములతో, మస్తిష్క పంక్తులతో నాపరిదేశ మత్యంత బీభత్సమై, జుగుప్సాకరముగ నుండెను. కన్నులరమోడ్చి యాతఁడొక్కింతసేపాలోచనాధీన మనస్కుఁడైనాఁడు. ఒకటిరెండు నిమేషములట్లే గతించినవి. ఆతఁడు కన్నులువిచ్చినాఁడు. బాలవీరులందు లేరు. వారట నే ముఖప్రక్షాళనాదులు గావించిరి. రక్తములగునుడుపులను మార్చిరి. శ్రీయాచమనాయనింగారి యశ్వమునకుగూడ గాయములనేకములు తగిలినవి. కాని యయ్యాజానేయము వానిని సరకుగొన్నట్లు కానరాదు. అదియథాపూర్వముగనే పయనము సాగించుచున్నది. యాచమనాయనింగారు మాత్రి మెద్దియో యోచించుచునే పోవుచుండిరి. ఉండుండి "చోళగుఁడా? ఆశ్రమమా? ఆతిథ్యస్వీకారమా? తన్నిరోధమా? అన్నియు నసన్వితములై యున్న వే" అని వారస్పష్టముగా నుచ్చరించు చుండిరి. కాని వారియాలోచనా ప్రవాహమునకు బాలుని పల్కులకంత రాయమును గల్పించినవి.

బా:- అప్పాజీ.

యాచమనాయనింగారింకను ధ్యానసముద్రముననే మున్గి యుండిరి. వారియాలోచనమప్పుడప్పుడా బాలవీరులపైఁగూడ బోవుచుండెను.

బా:- అప్పాజీ.

యాచమనాయనంగారదరి పడిరి. కన్నులు విచ్చి నల్వంకలఁ గలయఁజూచిరి.

యా:- రామరాయా! విశేషమేమైన నున్నదా?

బా:- ఎవ్వరో దుండగీండ్రు మనపైకి యుద్ధమునకు వచ్చుచున్నారు. అదిగో! గుఱ్ఱపుడెక్కల చప్పుడు.

ఇరువురును జెవులొగ్గి వినిరి. ఔను. నిజముగా నది జవనాశ్వఖుపుట ఘట్టనజనిత మహాశబ్దమే. యాచమనాయనిం గారి ముఖమండలము మరల క్రోధారుణమైనది. ఔను, నీవు పల్కినది నిజమే. సావధానుఁడవు గమ్ము". అని బాలునితో గంభీరముగ నాయనపల్కి, మహాభుజంగము వోలె భయంకరమైయున్న తన ఖడ్గముపై చేయివైచెను. ఒకటి రెండు ఘడియలు మాత్రమే గడిచినవి. యాచమనాయనింగారి ముఖమున హఠాత్తుగా సుప్రసన్నతారేఖలు గోచరించినవి.

యాచ:- (బాలునితో) వారుదుండగీండ్రుకారు.

బా:- మరెవ్వరు?

యాచ:- కర్ణాటసామ్రాజ్య ప్రతిష్ఠాపన పరతంత్రుఁడు రఘునాథుఁడు (ఉత్సాహముతో) అదిగో తంజాపురీ పతాకము.

కొలదిసేపటిలోనే వారు రఘునాథుని సేనలను సమీపించిరి. రఘునాథరాయలు మహోత్సాహముతో వారికడకే తెంచి, యాచమనాయనింగారికి నమస్కరించినాఁడు. ఆయన యు నానందతుందిల హృదయుఁడై, రఘునాథుని కౌగలించుకొనినాఁడు. ఇదివరకే యాచమనాయనింగారు నడచిన సకల వృత్తాంతమును నివేదించుకొనుచు నొక యాంతరంగిక లేఖను అచ్యుతనాయనింగారికి పంపుకొనియున్నాఁడు. అందు తాము

కొలది రోజులలోనే రామరాయలుకూడ తంజాపురికి వచ్చు చున్న విషయమును నివేదించి, ధర్మరక్షణ తత్పరులగు తంజా పుర ప్రభువులు, కర్ణాట సామ్రాజ్యమునకు సంబంధించిన యీ కష్టదశలో, ధర్మపక్షమునకే చేయూతనిచ్చి ధర్మమునే సముద్ధ రింతురని నమ్ముచున్నాను" అనికూడ వ్రాసినారు. అచ్యుత నాయనింగారు గోవిందదీక్షితులవారితో సంప్రదించిరి. గోవింద దీక్షితులవారును, "తత్క్షణమే రఘునాథుని సైన్యముగఁ బంపవలయును. యాచమనాయనింగారు మహావీరులయ్యు నిట్టిసమయమున నొంటిగాఁబ్రయాణము సేయుట ప్రమాద కరము" అని యచ్యుతనాయనింగారిని హెచ్చరించుటయే కాక స్వయముగా రఘునాథుని గూడఁ గార్యోన్ముఖునిగావించిరి. వెంటనే కొంతసైన్యము వెంటరా రఘునాథరాయలు బయలు దేరెను. కాని వారికి యాచమనాయనింగారి లేఖ యందుసరికే కొంతకాల విలంబనమైనది. కావుననే వారెంత త్వరితగతిఁబయ నముసాగించినను, సకాలములో యాచమనాయనింగారిని కలిసికొనలేకపోయిరి. రఘునాథునిజూచినంతనే రామరాయలు శోకవేగమునఁ గన్నులనీరు నించినాఁడు. రఘునాథుఁడును బాలునూరడించి, యుచితరీతి గౌరవించినాఁడు. మహోత్సాహ భరితులైయందరును, తిరుగుముఖమైరి. మధ్యమార్గమున యాచమనాయనింగారు రఘునాథునిట్లు ప్రశ్నించిరి.

యాచ:- నాయనా! రఘునాథా! నీవెన్నఁడైనను చోళ గుని జూచితివా?

రఘు (విస్మయవిస్ఫారితనయనుఁడై):— లేదు, ఏయట్లు ప్రశ్నించుచున్నారు?

యాచ:— పోనిమ్మెప్పుడైన నొక యాశ్రమమునకుఁ బోయితివా?

రఘు:— (ఇంచుక యోజించి) ఈమధ్యనే చిత్ఘనానంద ులను నొకయోగి యాశ్రమమునకు బోయితిని.

యాచ:— ఓహో! ఆతడు నీకెవ్వియైన ఫలమూలాదు లొసంగినాఁడా?

రఘు:— (ఇంచుకచకితుఁడై) ఔను. ఆతఁడు తన యాతి ధ్యమును స్వీకరింపుడని బహునిర్బంధించినాఁడు.

యాచ:— అప్పుడేమి జరిగినది. దాచక చెప్పుము.

రఘు:— (ఇంచుక జంకుచు) అప్పుడు అనగా నాయాతి ధ్యమును స్వీకరించుటయా? మానుటయా? అను ధర్మవిచికి త్సలో నేనుగొట్టుకొనుచుండు సమయమున నొక స్త్రీ మూర్తి నన్నా యాతిధ్యమును స్వీకరింపవుఁడని నిరోధించినది.

యాచ:— (చకితుఁడై) స్త్రీయా? బాగుగ జ్ఞప్తియం దున్నదా? పురుషుఁడు కాఁడా?

రఘు:— కాదు. నాకు బాగుగా జ్ఞప్తియందున్నది. ఎందున్నను నెట్టివేషాంతరమును గైకొన్నను నేనామె నాన వాలుపట్టగలనను నమ్మకము నాకుఁగలదు.

యాచ:- నీవొక ఘంటకిత్రమే వచ్చియుండినచో, నొక విచిత్రసంఘటనమును జూచియుండెడివాఁడవు.

రఘు:- (కౌతుకముతో) ఏమది?

యాచ:- ఇప్పుడు హోరణ్యమున మాకు ఘాతుకులతో సమరము సంభవించినది. మేమిద్దరమే. వారువందలకొలఁది గలరు. మేమును శక్తివంచన లేకుండ యుద్ధము గావించితిమి. కాని యిసుమంతయుఁబ్రయోజనము లేదాయెను. ఇంతలో నెవ్వరో యిద్దరు బాలయోధులచ్చటికి శ్వేతాశ్వముల నధిరోహించివచ్చి, యామూకల వధియించి, మాకమూల్యసాహాయ్యముగావించిరి. వారిని నేనెచ్చటను జూచినట్లు గుర్తు లేదు. కా వారికినేను చిరపరిచితుఁడనేయట. ఇంతకంటె చిత్రమేమనఁగా, మరలి పోవుచు వారు నీకు తమధన్యవాదముల నర్పించిరి.

రఘు:- (విస్మయముతో) నాకా?

యాచ:- ఔను, వారు నీకును జిరపరిచితులే యట. మరియుఁ చోళగుని యాశ్రమమున నాతిథ్యము స్వీకరింపఁ బోవుచో, రఘునాథరాయుల నెవ్వరు నిరోధించిరో, వారు తమ ధన్యవాదముల నర్పించుచున్నారని రఘునాథరాయుల వారికి మా మాటలుగా మనవి సేయుడు, అనికూడఁజెప్పిరి.

రఘు:- ఏమో? అంతయుఁ గథవలెనున్నది. వీరుఁ జూడ పురుషులు. మరియు నిద్దరు. నన్ను నిరోధించిన వ్యక్తి స్త్రీ. మరియు నొక్కర్తుక. — సరే దానికేమిలెండు? కాని

మధ్యేమార్గమున మిమ్ము ఘాతుకులడ్డగించిరా? ఎంత ప్రమాదము! మీలేఖ మాకు సకాలమున కందినదికాదు. లేకున్న నిట్టి యత్యాచారమున కవకాశమే యుండెడిదికాదు. నేను మీ యుడుపులనుబట్టి యించుక యనుమానించియు, మొట్ట మొదటే యట్టిప్రసంగముసు గావించుటంత సంభావ్యముగనుండ దేమో అని తత్ప్రవర్తనమునుండి విరమించుకొంటిని.

యాచ :- మా యుడుపుల నిప్పుడు మార్చినాము. సమరావసరమున ధరించిన యుడుపులివి కానేకావు. అవియే చూచినచో, నీకట్టి సందేహమే కలుగకయుండెడిది. పిమ్మట వారనేక విషయములనుగూర్చి ప్రసంగించుకొనుచుఁ బయనము సాగించిరి.

---

## ఎనిమిదవ ప్రకరణము.

రామరాయలను తంజాపురముఁ జేర్చుటతో యాచమ నాయనింగారి పని ముగియలేదు. విశ్రాంతిఁ దీసికొనుటకైన వారాయూర నాగలేదు. వెంటనే బయలుదేరి యుత్తరాంధ్రమున కేగి యందున్న మన్నీలకుఁ బరిస్థితులన్నియు నెఱుకపఱచి జేసి వారినందరిని సమరోన్ముఖుల గావించిరి. వారందరు నింతకు ముందే శ్రీరంగరాయలపంక కించుక మొగ్గియుండిరి. కాని తగిన నాయకుఁడు లేక యింతవరకు మూకీభావము వహించి యుండిరి. ఇప్పుడు 'రఘునాథరాయలు' 'అహామస్మి' అని ముందుకువచ్చి, రామరాయల పక్ష మవలంబించియుండుటచే వీరందరు శంకాతంకములు వీడి, రామరాయలకు సాహాయ్య

మొనరింప నంగీకరించిరి. కొందరు తటస్థులు గలరు. వారు యాచమనాయనింగారి, వాఁడైన్న పుణ్యాముననును రాజ్యతంత్రజ్ఞత కును లొంగిపోయిరి. రఘునాథుఁడు వీరందరికంటె వయసునఁ జిన్నవాడయ్యు, విద్యాబుద్ధులందధికుఁడే. మరియుఁ దన వినయ సంపదచేతను బలపరాక్రమాతిశయము చేతను, నైతికదీక్ష చేతను వీరందరికి నింతకుముందే ప్రీతిపాత్రుఁడై యున్నాఁడు. కావున నాతని బావుటాక్రింద మేము పనిసేయుటయా ? యని మన్నీలు పౌరుషపడ లేదు సరికదా పరమోత్సాహ భరితులై తమ సమ్మ తినే యొఱుకసేసిరి. ఏమైననేమి ? రామరాయలకు మంచి రోజులు వచ్చినవి. మాటయిచ్చి నంతనే రాజులందరు, సైన్య ములు కూర్చుకొని తంజాపురమున కేతెంచిరి. సైనికుల యట్ట హాసార్భటుల చేతను: హయ హేషలచేతను, గజ ఘీంకృ తులచేతను, తంజాపురము మాఱ్ఱోగుచుండెను. అంతట అచ్యు తరాయలవారి రక్షణకై యాచమనాయనింగారిని నియోగించి మహామంత్రులపై రాజ్యభారముంచి రాయలు బయలుదేరెను. ప్రయాణభేరి మ్రోగినది. పారావారమువోలె భహువిస్తృ తమై యున్న సైన్యసమూహ మంతయు నొక్కుమ్మడి చలించి నది. రఘునాథరాయల కప్పుడు కావింపవలసిన మహాకార్య ములు మూఁడు కలవు. ఒకటి చోళగ సంహారము, రెండు సింహళేంద్రుని జాడలగన్గొని బుడతకీచుల నోడించి యాతని రాజ్యము నాతని కప్పగించుట. మూడు కర్ణాట సింహాసనముపై రామరాయలను నిలుపుట. దిగ్విజయ యాత్రామిషంబున నీ మూఁడుకార్యములును నిర్వహింపవలెనని యాతనియాశయము.

తొలుదొల్త పాదచారులగు సైనికులు నడచుచుండిరి. తరువాత నశ్వదళమును దానివెనుక గజఘటలు నుండెను. విజయగరుడాద్రియను పట్టపేన్గునధిరోహించి రఘునాథరాయలు బయలుదేరెను. రామభద్రగజాధి రాజంబుపై రామరాయలు సుఖోపవిష్టుఁడై యుండెను. పురుషోత్తమయ్య నరసప్పయను మహావీరులు మత్తదంతావళము నధిరోహించి ఒకవంక సైనికులను హెచ్చరించుచుండిరి. అప్పైప్ప, అళగప్ప యనువారలు, మదగజముల నధిరోహించి విజయగరుడాద్రి కిరువంకల నంగరక్షకులుగా నమరియుండిరి. రాజులు, మన్నీలు, రౌతులు, దొరలు తమతమ తేజీలపైనెక్కి, ధీరులై కొల్చి వచ్చుచుండిరి. కోనేటి కొండ్రాజుగారు, కట్ట రంగపరాజుగారు, కస్తురిరాజుగారు, మిట్టిపాళెంపు సంపెట నాగరాజుగారు, రామరాజుగారు, ఔకు రఘునాథరాజుగారు, మామ ఓబళరాజుగారు, మనుబ్రోలు రాజుగారు, నందేల చింత్రాజుగారు, నారపరాజుగారు కందన వోతరాజుగారు, గడి తిమ్మరాజుగారు, మొదలుగాగల మన్నీలు, తమతమ సైన్యములు వెంటరా నిరుపార్శ్వముల గాచియుండిరి. కోనేటి కొండ్రాజు పరాజయమెరుగని పౌరుషశాలి. కదనరంగమునఁ గాలుకదుపని మేటివీరుఁడు. రంగపరాజు రణరంగ కళాకోవిదుఁడు. ఎదిరిబలముల చెదరగొట్టి, గగ్గోలు గావించి, కసిమసంగగల కడిందివీరుఁడు. కస్తురిరాజు నిస్తుల పరాక్రమశాలి, పగతురపాలిటి ప్రళయకాల రుద్రావతారము. నాగరాజు నవ్వ్యాయుధ మర్మజ్ఞుడు, గురితప్పకుండ తుపాకిపేల్చి యరివీర కంఠలుంఠనము గావించుటయందగ్రగణ్యుఁడు. రామ

రాజును రఘునాథరాజును సాముగరిడీలలో నారి తేరినవారు. సాహసైకధనులు. ఓబళరాజు గారోటమి యెఱుంగని పోటు మానిసి. మనుభోజిలు రాజుగారు శనన్దవదహాన సదృశుఁలు. నంజేల చిత్రరాజు భండనభీముడే, బొకుపట్టున నాతనిపేరు సెప్పి యింకొకరి పేరు చెప్పవలయును. కందవోతరాజు మంమునకైన వీరికి కండలేని బిరుదు మగడు. గడి తిమ్మరాజు గండపెండారము ధరించిన వీరుఁడు. శత్రుసేనల బీభత్సము గావించుటలో సవ్య సాచి కెనవచ్చువాఁడు. వీరేకాక, కాలువ రాజులును, కడప రాజులును, పాళెమ రాజులును, పంటరాజులును, కైజీతంపు దొరలును, జాపల్లివారును, దేసటిరెడ్ల తెగలును, మందువ వారును, కంబము కొండవీటి కొండపల్లిరెడ్లును జవనాశ్వముల నధిరోహించి, వీరోచితమగు వింతశేవితో నగరభాగము నలంక రించి యుండిరి. మరియు మామ మూర్తెప్పగారు, కుమార రంగయ్యగారు, పామినాయనివారు, బలుమూరివారు, దృఢ తరతనుత్రాణముల ధరించి, యాశీవిషోపమంబులగు కరవాల ముల గేలఁగీలించి యశ్వదళమును నడిపించుచుండిరి.

ఇట్లతి భీషణంబైన సైన్యముతో రఘునాథరాయలు, నలసంవత్సరాషాడ శుద్ధ పంచమీ దివసమున, దిగ్విజయ యాత్రఁ గావింప నారంభించెను. సైన్యము నిద్రాహారములు మాని నిరంతర ప్రయాణములు సాగించుచుండెను. ఇట్లతి త్వరిత గతిఁ బయనము సేయుటలో రఘునాథునకొక ప్రయోజనము గలదు. బుడతకీచుల సైన్యము ద్విధావిభజింపఁ బడియున్నది. అందొకటి దేవికోటను రక్షించుచున్నది. ఇంకొకటి జాఫ్నా

కోటనుగాపాడుచున్నది. పాండ్య తుండీరాధిపతుల సైన్యములును జగ్గరాజు సైన్యము నేకమై చంద్రగిరియందున్నవి. ఈ మూడు స్థలముల యందున్న సైన్యములు నొక్కచో కలిసినయెడల, శత్రువు లజయ్యులగుదురు. కావున వారు కలియకుండగనే, ఎచ్చటివారి నచ్చటనే యోడించుట సుకరమని రఘునాథుని యూహ. అందులకే సైన్యములు హుటాహుటీ బయనము సాగించినవి. క్రమక్రమముగా వారు కావేరీ సాగర సంగమ ప్రవేశమును చేరిరి. ఉత్తుంగ తరంగ సంఘములతో సముద్రము మహాభయంకరముగ నుండెను. కాని, రఘునాథరాయలకు ఇట్టి ఆటంకములొక లెక్కలోనివి కావు. ఆతడు వెనుకంజ వేయలేదు. నిశితబుద్ధియగుటచే నాతనికి నదుపాయ మొక్కటి యప్పుడే స్ఫురించినది. పడవల వంతెనకట్ట సముద్రతరణము గావించుట సుకర మని యాతడూహించినాడు; ఆ యూహయే ప్రశస్తమని నలుగురు నామోదించిరి. వెంటనే పడవలు సిద్ధమైనవి. సైనికు లందరు సముద్రతరణము గావించిరి. రఘునాథరాయలు మాత్రము తన పట్టపేన్గునెక్కియే సముద్రమును దాటినాడు. మధ్యేమార్గమున వీరి కంతరాయము గల్పింప చోళగుడు యత్నించినాడు. కాని రాయల సైన్యధాటికి, ఆ దుండగీండ్రు నిలువలేకపోయిరి. క్రమక్రమముగా సేనలన్నియు, చోళగుడున్న దీవిని సమీపించినవి. అచట పోర్చుగీసువారు కొన్ని ఫిరంగుల నమర్చియుండిరి. రఘునాథుని సైన్యము నతిదూరమున నుండగనే ఆయంత్రములు అగ్నిగోళముల జిమ్మసాగినవి. పిడుగులవలె బెడిదమ్ములైన ఆగోళముల ధాటికాగలేక రఘునాథుని సైన్యములో

కొందరు మరణించిరి. కాని రాయలు మిక్కుటమగు ప్రోత్సాహము నొసంగి చెదరిన సైన్యముల కూడుకు పరచుకొని మహా వేగముతో నాప్రదేశము నధిగమించినాడు. మరియు గొన్ని ఫిరంగులను గూడ గైవశము జేసికొన్నాడు. కోటవెలుపలనున్న చోళగుని సైన్యమంతయు నించుమించుగ నశించినది. కొలది మంది మాత్రమావార్తను చోళగున కెరింగించుటకై మిగిలి యుండిరి. వారాకార్యమును నిర్వహించుటలో నెట్టి యశ్రద్ధయు జూపలేదు. పలాయన మంత్రమును బఠించుటలోఁ వారగ్రగాములు.

మరునాడు రఘునాథరాయల సైన్యము దేవికోటను జుట్టుముట్టినది. కాని ఏమి ప్రయోజనము; ఆకోట శత్రుదుర్భేద్యమైయుండెను. ఆకోటగోడలు కేవలముమట్టితోనిర్మింపబడినవే. కాని అవి ఇనుప గోడలకంటె బలీయములై యున్నవి. అయినను అది వట్టిమట్టియా? చింతపుంబలి జిగురుతో బిగిసియున్న మొండుమట్టి. ఫిరంగులు పేల్చినచో నందుండి యొక్కపెల్ల వ్రాలునేగాని గోడ బీటయైన నీయదు. ఇంకేమి చేయవలయును? ఆకోట తలుపులయోనిర్మితములు. వాని పగులగొట్ట బ్రహ్మ తరముగాదు. సైనికులు కోటగోడలపైకెగబ్రాక యత్నించిరి. కాని అందును వారు సఫలమనోరథులు కాలేదు. చోళగున భటులు సలసల గ్రాగుచున్న నూనియను బోసియు తప్తాంగారములను విరజిమ్మియు, కరకురాళ్లను బడద్రోసియు నిశితభల్లములతో బొడిచియు రఘునాథుని సైన్యముల నొప్పించుచుండిరి. రాయలకేమిచేయుటకును దోచుటలేదు. ఆతనిమహాప్రయత్నము

పునాదులలోనే గూలిపోవునేమో యను సందేహము అతని హృదయక్షేత్రమున నంకురించినది. భైరవాను గ్రహమున ననన్యలబ్ధములగు వరములు వడసిన చోళగుని సంహరించుట మనుష్య మాత్రుల కలవిగాని పనియని యాతడొకమారూహించును. ఒకమారు పురుషప్రయత్నమున కసాధ్యమేమున్నదని సమాధానపడును. దుర్నీతులకే దైవమేల సాహాయ్యము చేయవలెనని ఒకమారు దైవమును దూరును. ఎన్ని అంతరాయములు సంభవించినను ధర్మమే జయించి తీరునను పెద్దల వాక్యము స్మరణకురాగా మరల ధైర్యమవలంబించును. ఇట్లు పరిపరివిధముల నూహించి, యూహించి రఘునాథుడొక స్థిరనిశ్చయమునకువచ్చినాడు. తనయేలిక సామియగు శ్రీరామచంద్రునకొకనమస్కారము గావించి, "రేపు సాయంసమయమగుసరికి నేను చోళగుని సంహరింపలేకున్న చో సాయుధముగ నగ్నిప్రవేశ మొనర్తును. నీ శ్రీపాదములయాన" అని, భీషణమగు ప్రతిన వట్టినాడు. క్షణకాలములో నాప్రతిజ్ఞావిషయము సైన్యమంతటను బ్రాకినది. సేనాసమూహమున నొక మహాకోలాహలము జనించినది. ఎవరినోట విన్నను నీప్రతిజ్ఞావాక్యములే వినవచ్చుచుండెను. సాహాయ్యము కావింపవచ్చిన మేటివీరులందరు సంభ్రమాకులిత మనస్కులగు చుండిరి. ఎవ్వరికినేమియు బాలుపోవుటలేదు. ఇంత దుర్భేద్యమగు దుర్గమింత త్వరలో వశమగుట సంభావ్యమాయని కొందరు యోజించుచుండిరి. ఏమైననేమి? తుదకందరు నొక్కటే స్థిరనిశ్చయమునకు వచ్చిరి. "మరునాడాహవరంగమున విజయలక్ష్మినైనఁజేపట్ట వలయును. లేకున్న

వీరస్వర్గమైన నలంకరింపవలయును, అను వాక్యములే ప్రతిసైని కునినోటను వినవచ్చుచుండెను. భటులందరును రఘునాథ ప్రాణరక్షమునకై తమ యసువుల నర్పింప సర్వసంసిద్ధులై యుండిరి. కాని యెందరెన్ని నిశ్చయములకు వచ్చినను గోట స్వాధీనమగు వెరవుమాత్రము గోచరింపదాయెను.

ఆనాటిరాత్రి రఘునాథరాయలొంటరిగఁదన గుడార మున శయనించి యుండెను. ఆతఁడెంతగాఁ బ్రయత్నించినను నిద్ర రాదాయెను. తరంగములవలె నాలోచనలొకదాని వెంకనొకొక్కటివచ్చి యాతని మస్తిష్కమును బాధుచేయు చుండెను. ఉన్నట్లుండి యాతఁడు శయ్యవీడి యీవలకు వచ్చి నాఁడు. ఆకసము వినీలస్వచ్ఛమైయున్నది. కాని చంద్రుడప్ప టికే యస్తశిఖరిమాటున కేగినాఁడు. దూరమునుండి సముద్ర నిర్ఘోషము వినవచ్చుచుండెను. గాలి చల్లగావీచుచుండెను. ఆతఁ డొక్కనిట్టూర్పు విడిచినాఁడు. తన హృదయాధినాథుఁడు, తన యేలికసామి, శ్రీరామ చంద్రుఁడే విశ్వరూపమును ధరించి తనకు సాక్షాత్కరించినాఁడా? అదిగో! స్వామి శత్రుసంహా రమును గావింప ధనుష్టంకారముఁగావించుచున్నాఁడు. లేకున్న నాగంభీరనినాద మెచ్చటినుండివచ్చును. అవి నక్షత్రములా? కావు కావు. నాసామి నర్చించుటకై యమరులు సేకరించిన యనర్ఘ మణిగణములు; ఆమ్లాన సురభిళ మందార సుమ మంజరులు. కాకున్న నీ నక్షత్రములకింతటి కాంతి యెక్కడిది? ఇంతటి మనోజ్ఞతయెక్కడిది. ననుగన్న తండ్రి, నా ముంగిటి పెన్నిధానము, నను బ్రోచు వేల్పు

నాకు సాక్షాత్కరించినాఁడు. తన కృపాళుత్వమును బ్రకటించినాఁడు. ధన్యము. నాజీవితము ధన్యము "ఈతుదిమాటలించుక స్పష్టముగా రఘునాథుడుచ్చరించినాఁడు. "మహాభాగా! మీ జీవితమెప్పుడును ధన్యమే." అనువాక్యము మంద్ర గంభీరమగు వల్లకీనిస్వనమువోలె, రఘునాథుని కర్ణకుహరములఁబడినది. భక్తి పులకితగాత్రుఁడై, తన్నుమరచి, విశ్వమునే మఱచి, కేవల శ్రీరామచంద్ర పాదారవింద ధ్యానాధీనమనస్కుఁడై యున్న రాయఁడామాటలు వినినంతనే కన్నులు విచ్చినాఁడు. చిట్టచీకటిగానున్నది. ఎట్టయెదుట నెవ్వరో నిలిచియున్నట్లు మాత్రమే గుర్తింపగలిగినాఁడు.

రఘు :-మీరెవ్వరో తెలిసికొను ప్రయత్నము నాకిప్పుడు లేదు. తన నిరతిశయ కృపాతిశయమున నా ప్రభువు సాక్షాత్కరించిన పుణ్యసమయముననే తమ దర్శనముభాగ్యమును నాకులభించినది. కావున మీరుకూడ పుణ్యదర్శనులే.

వ్యక్తి :- (వినయముగ) దేవా! శత్రుసంహారముకానిదే రఘునాథుఁడెన్నడైన శస్త్రమునేమరినాడా ?

రఘు :- (విస్మయముతో) మీవాక్యధోరణి కొంచెము వింతగా నున్నది. మీరు నిశ్చయముగా నా ప్రభువుదూతలే. నన్ను ప్రబోధింపనేతెంచిన మహానుభావులు.

వ్యక్తి :- వీరపురుషా! నన్నంతగాఁ బ్రశంసింపనేల ? నా కర్తవ్యమును నేను నిర్వహింపనేతెంచితిని కాని మీ కర్తవ్యమునే మీరేమరియున్నారు.

రఘు :— (సావధానముగ) నా కర్తవ్యమును నేను మరువలేదు.

వ్యక్తి :— మరువలేదా ?

రఘు :— మరువలేదు.

వ్యక్తి :— మహాశయా! చోళగ సంహారమునకై తా మెట్టి ప్రయత్నములు గావించితిరి. కేవలము ప్రతిన వట్టుట యేనా ?

రఘు :—(సావధానముగ) ప్రతినవట్టి యూరక నిద్రించుట రఘునాథుని మతముకాదు. రఘునాథుఁడు వ్యర్థప్రతిజ్ఞలు సేయువాఁడు కాఁడు. వట్టి ప్రగల్భములు సెప్పుటయు నెఱుంగడు. అన్నియు రేపాహవరంగమున మీరే చూచెదరు.

వ్యక్తి :— మీరు వ్యర్థప్రతిజ్ఞలు సేయువారని నేనన లేదు. కాని తన్నిర్వహణమున కొక వెరవు కనుగొనవలదా ?

రఘు :— వెరవు ? వెరవేమున్నది ! వీర పురుషోచిత మగు వెరవుయుద్ధ మొనర్చుటయే కదా.

వ్యక్తి :— యుద్ధమొనర్చి మీరు చోళగుని సంహరింప మీరెన్ని ఫిరంగులు కాల్చినను ఆతనికోట మీకు స్వాధీనము కాదు.

రఘు :— ఔను. మాకాసంగతి తెలియనిదికాదు. కాని మాకింతకంటె గత్యంతరము లేదు. ఉపాయాంతరమును లేదు.

వ్యక్తి :- ఉన్నది. ఉన్నయెడల దానిని మీరనుసరింతురా ?

రఘు :- ధర్మదూరముకానిచో తప్పక యనుసరింతును.

వ్యక్తి :- అయిన నావెంట రండు.

ఇరువురును కదలినారు. రఘునాథరాయలు నలువంకలఁ గలయఁజూచినాఁడు. తాను పరధ్యానముగాఁ జాలదూర మరు దెంచినట్లు గుర్తించినాఁడు. తనసేనలు విడిసియున్న చోటచటికి రమైలు దూరమున నున్నది. తనముందు నడచుచున్న వ్యక్తి నాతఁడు చూచినాఁడు. ఆ చీకటిలో రూపురేఖలంత విస్పష్టముగా లేవు. ఆతఁడు వీరపురుషోచితమగు ఖడ్గమును ధరించినాఁడు. కాని యాతని నడకతీరు మాత్రము రఘునాథునకు వింతగాఁ దోచినది. వారట్లు నడచి నడచి యొక తటాకమును సమీపించిరి. రఘునాథుఁడు నలువంకలఁ గలయఁజూచినాఁడు. అదియొక చిట్టడవి. దూరముగా దేవికోట యొక గుమ్మటము వలెఁ గన్పట్టుచున్నది. అందు మనుష్య సంచారమేయున్నట్లు కానరాదు. ఆ తటాకము జలపూర్ణమై యున్నది. పురుషుఁడచ్చట నాగినాఁడు. తటాకమునకు పెద్దమెట్లు గలవు. ఇరువురు నా మెట్లవెంబడి దిగినారు. నూత్నపురుషుడా మెట్లు లెక్కించుకొనుచుఁ బోయి పదియవ మెట్టుదగ్గర నిలిచినాఁడు.

రఘు :- ఇదియేనా మన గంతవ్యము ?

వ్యక్తి :- అగునిదియే.

రఘు :- ఇచ్చట మనమేమి చేయవలయును ?

వ్యక్తి :- చూడుఁడు.

ఆ పురుషుఁడు తనకు వలపలిప్రక్క పద్మాకృతిగానున్న యొక శిల్పమునుబట్టి గట్టిగా యూచినాఁడు. చిత్రము ఆ సోపానము రెండుభాగములుగ విడిపోయినది. అందుండి యథో ముఖముగ సోపానపంక్తి దృగ్గోచరమైనది. రఘునాథుఁడు మోమునంచి చూచినాఁడు. ఆ సోపానములన్నియు పాల రాతితోఁ జేయఁబడియున్నవి.

పురు :- రండు.

రఘు :- రహస్య ద్వారమా ?

పురు :- అగును.

ఇరువురును లోనికిఁబోయిరి. కొలది దూరమేగుసరికే సోపానము లంతరించినవి. ఇరువురు నొక సురంగమార్గమునఁ బడి పోవుచుండిరి. కొంతదూరమేగుసరికి వారి యెట్టయెదుట మరల సోపానపంక్తి గోచరించినది. వారా సోపానముల నధి రోహించి పోయి యొక యుత్తమమందిరమును జేరిరి. ఆ మంది రము చంద్రకాంతశిలా వినిర్మితమై స్వచ్ఛమైయుండెను. అందొక వంక భైరవదేవుని మహావిగ్రహము కలదు. ఆ విగ్రహము చెంత నఖండ దీపముగలదు. దాని కనతిదూరముననే యొక హోమగుండము గలదు. ఆ దీపకాంతులలో నా భైరవమూర్తి మిలమిల మెరసిపోవుచుండెను. చతుర్భుజుండును, విస్ఫురద్దం ష్ట్రాకరాళ వదనుండును, వివిధాయుధ భయంకరపాణియునగు

నా భైరవుని గాంచినంతనే భయచకితులు గానివారరుదు. కాని రఘునాథునకు మాత్రము భైరవుఁడు ప్రసన్న వదనముతోఁడనే సాక్షాత్కరించినాఁడు. భక్తిపులకితగాత్రుఁడై రాయలమ్మహాదేవునకు సాష్టాంగముగఁ బ్రణమిల్లినాఁడు. ప్రసన్న మందస్మిత వదనముతో నద్దేవదేవుఁడు తన్ను బలకరించుచున్నట్లాతనికి దోఁచినది. రఘునాథుఁడు లేచి నిలిచినాఁడు.

రఘు :— (పురుషునితో) మహాత్మా! నేనిప్పుడేమి చేయవలెనో సెలవిచ్చెదరా?

వ్యక్తి :— (మందహాసముతో) మీరుధిరముతో భైరవుని దృప్తిఁబొందింప వలయును.

రఘు :— (ప్రసన్నముగ) ధన్యుఁడను. మహాశయా! భౌతికమగు నీ పిండదేహమేనాటికైన నశించునదేకదా! దీని కింతకంటె సద్వినియోగమేమి కలదు. (ఖడ్గము నూడఁబెరికి) ఇదిగో నాశిరమిప్పుడే భైరవుని పాదపద్మములపైఁ దాండవమాడ గలదు.

వ్యక్తి :— (ఆతురతతో) ఆగుడాగుఁడు. మీ సాహసము విక్రమాదిత్యుని దలంపునకు దెచ్చుచున్నది. కాని నా యభిప్రాయమది కాదు.

రఘు :— మరేమి?

వ్యక్తి :— భైరవదేవుని హృదయభాగమున మీకెద్దియైన గోచరించుచున్నదా?

రఘు :— ఆఁ! ఒక యక్షరమువలె నున్నది.

వ్యక్తి:— ఆయక్షరమేతద్దేవుని కీలకమంత్రము. బీజాక్షరము. దానినుచ్చరించుచు, మీ నుదిటి రక్తము నైదుమారులీ హోమగుండమున నాహుతి వేయవలయును. ఆయాహుతులను గ్రహించి, యీదేవుఁడు మీయెడఁ బ్రసన్నుఁడగును.

రఘునాథుఁడట్లే తన రుధిరము నాయగ్నిగుండమున వేల్చినాఁడు. చిత్రము. ఆయగ్నిగుండమునుండి యొక మహాఖడ్గమీవలకు వచ్చిపడినది.

వ్యక్తి:— ఆఖడ్గమును గ్రహించి భైరవునకు నమస్కరింపుఁడు.

రఘునాథుఁడట్లే చేసినాఁడు. మరలనాతనికి భైరవుని మందస్మిత ప్రసన్నవదనమే మానసగోచరమైనది.

వ్యక్తి:— రాజేంద్రా! కాల మతిక్రమించు చున్నది. త్వరపడుఁడు. ఆఖడ్గము మీచేతనున్నంత కాలము మీరు సురాసురులకు గూడ నజయ్యులై యుందురు. కాని యొక్క రహస్యము. ఈఖడ్గమును మీరు చోళగునిపైఁదక్కనన్యులపైఁ బ్రయోగింపరాదు. అట్లు ప్రయోగింపబడిన యీ శస్త్రము ప్రయోగించిన వారిని సంహరించును. మరియొక విషయము. ఇది చోళగ సంహారమైనంతనే భైరవునిలో లీనమగును.

రఘు:— మహాశయా! నేనీ మహాఖడ్గము నమార్గమున నుపయోగింతునని మీయభిప్రాయమా? మీకింతసందేహమేల! నాకీఖడ్గమే వలదు. నేనిమ్మార్గము నవలంబించినందులకు నాలో నేనే సిగ్గిలు చున్నాను.

వ్యక్తి:—మహాపురుషా! కేవల సత్యస్వరూపులగు మిమ్మె వ్వరు శంకింతురు. ఈమాంత్రిక మార్గము నవలంబించినందు లకు చింతిలు చున్నారా? ఈమార్గము వీరపురుషోచితము గాదనికదా మీయభిప్రాయము, కాని మీరొక్క విషయమును మరచు చున్నారు. చోళగుడు మంత్రశక్తి గలవాఁడు. భైరవో పాసనము గావించి దురాపములగు వరములఁబడసినాఁడు. ఆతనికి కామరూప కామగమనములు గలవు. భైరవనిర్మితమగు త్రిశూలమును కేలఁగీలించి యాతఁడాహవ రంగమున నిల్చినచో నాతని నెదుర్కొని పోర సురాసురులకును శక్యముగాదు. ఇంక క్షుద్రమానవులాతని కొక లెక్కయా? మహావీరులెందరో యాతని త్రిశూలమున కెరయైరి. వానిని సంహరింపవలెనన్నచో నిదియొక్కటే యేకైకమార్గము. మంత్రపూతమగునీ ఖడ్గమే వాని త్రిశూలమును రూపుమాపగల మహాయుధము. సమర రంగమున నాత్రిశూలమగ్నిజ్వాలల గ్రక్కుచు శత్రుసైన్యాట విని దవదహనమువోలె దహించును. ఆయగ్నిజ్వాలలు మంత్ర బలోత్థితములగుటచే భౌతికములగు సాధనములచే నార్పనలవి కానివి. ఇంకనాతని సంహరించు నుపాయమేమి కలదు? అతనిని సంహరింపకున్నచో జగత్కల్యాణమెట్లు చేకూరును. ఈరాష్ట్ర మున నాతఁడు గావించిన హత్యలకు మితియున్నదా? ఆతని యత్యాచారములచేఁగారింపఁబడని పతివ్రతామ తల్లులుకలరా? తమకన్నులయెదుటనే యాత్రిశూలమున కెరయైన తమ శిశువు లను దలంచుకొని, యేడ్చుసెల్లాండ్రయాక్రందనధ్వను లిప్పటికిని మనకర్ణకుహరములఁ బ్రతిధ్వనించుట లేదా? రాజేంద్రా! చోళగ

సంహార మవశ్య కర్తవ్యము. దానికీమార్గ మొక్కటియే శర ణ్యాము. జగమంతయు దారుణాగ్ని జ్వాలలోఁబడి, మ్రగ్గిపోవు చుండగాఁ దన్నివారణోపాయము నాలోచించుట యుక్తమో లేక, పౌరుషము పౌరుషమని యూరకప్రగల్భములు పల్కుట యుక్తమో, మీరే నిర్ణయించుకొనుఁడు.

రఘు:- మీమనసునకు చాలనొప్పి కల్గించినట్లున్నాను. క్షమింపుఁడు.

పురు:- ఇందుక్షమించుటకేమియును లేదు. వేళ యతిక్ర మించుచున్నది. చోళగుడింక నీస్థానమునకే వచ్చును మరలి పోదము రండు.

---

## తొమ్మిదవ ప్రకరణము.

మరునాఁడు పోరు ఘోరముగ సాగుచున్నది, రఘునాథ రాయల సైన్యమప్రతి హతపరాక్రమమును ప్రకటించుచున్నని. నడగొండలవంటి యేన్గులు సింహద్వారమును డీకొనుచున్నవి. గుభిల్లు గుభిల్లుమను శబ్దముతో సింహద్వారము కంపించు చున్నదేకాని, తెరువీయ లేదు. కొందరు సైనికులు నిచ్చెనలు వైచుకొని కోటగోడలపై కెగఁబ్రాక యత్నించుచున్నారు. పైనున్నవారీటెలతోఁ బొడుచు చున్నారు. కాని రాయల సైనికులు వెనుదీయ లేదు. అగ్ని వర్షమున కాహుతి యగుచున్నారు. హాహాకారములొనర్చుచుఁ గొందరు కూలి పోవుచున్నారు. కాని సైన్యము, గుంపులు గుంపులుగా, తండో

పతండములుగా వచ్చిపడుచున్న. అట్టిసమయమున రఘునాథుఁడొకసాహస కార్యమునాచరించినాఁడు. తనవిజయగరుడాద్రి నెక్కి చేత మహాఖడ్గమును ధరించి, కోటగోడను సమీపించి నాఁడు. ఒక్కయురుకునఁగోటగోడపైకి లంఘించినాఁడు. లంఘించుటయే తడవుగా నచ్చట నున్న యిర్వురు సైనికుల నొక్క మారే తనకత్తికెరచేసినాఁడు. ఇంకేమున్నది. రఘునాథుని వెంటనే హాస్యెప్పయ శెగప్పలుగూడ బాహ్యప్రాకారము పైకిలంఘించిరి. మువ్వురు నచ్చటనున్న సైన్యమును నురుమాడదొడగిరి. చోళగుని సైన్యమాప్రదేశమునకు వచ్చులోగా, రాయల సైన్యమాప్రదేశము నాక్రమించినది. వెంటనే కొందరు కోట దేవిడీ తెరచివైచిరి. ఇంకేమున్నది? ఒక్క పరువున రాయల యశ్వదళమంతయు లోనఁబ్రవేశించినది. వెన్వెంటనే సైన్యమంతయుఁగోటలోఁ బ్రవేశించినది. చోళగుని సైన్యముకూడ ప్రత్యంగుళమునకును రాయల సైన్యము నెదుర్కొనుచునే యున్నది. కాని చావునకు తెగించి యుద్ధమొనరించుచున్న రాయల సైన్యమును నివారించుట వారికి సాధ్యమైనదికాదు. రణరంగమున కొందరు బలియైననుసరే రాయల ప్రాణములు మాత్రము రక్షింపఁబడవలెనను స్థిరనిశ్చయముతో రఘునాథుని సైనికులు పోరుసల్పుచుండిరి.

రాయల సైన్యము దేవికోటఁ బ్రవేశించినదను వార్త వినినంతనే చోళగున కరికాలుమంట నెత్తికెక్కినది. అతఁడు ప్రళయకాలరుద్రునివలెఁ భయంకరమగు నొక యట్టహాసమును గావించి, కేలఁదిరిశూలమును గిలించి యొక మత్తకరీంద్రము నధి

రోహించి, యూహావరంగమున కేతెంచినాఁడు. చోళగుని త్రిశూలము ప్రళయతాండవము గావించుచున్నది. రాయల సైన్యముల నురుమాడుచున్నది. అగ్నిగోళముల వర్షించుచున్నది. మృత్యుదంష్ట్రికరాళమై యసువుల గ్రసియించుచున్నది.

రాయల సైన్యమంతయుఁ జెల్లాచెదరైపోయినది. సైన్యాధిపతులెంత ప్రయత్నించినను దాని నొక్కచో నిలుపలేకుండ నున్నారు. కాని యంతలోనే తమ ప్రతిజ్ఞను స్మరించి వెనుకంజ వేయక నిలువసాగిరి. తండోపతండములుగఁ దదగ్నిజ్వాలల కాహుతి యగుచుండిరి. రాయల సైన్యమునందలి హాహాకారములు మిన్నుముట్టినవి. రఘునాథరాయ లనతిదూరముననే యుద్ధము సేయుచున్నాఁడు. తన సైన్యమునందలి హాహాకారములను విని, తన మాతంగము నావంకకు ద్రిప్పినాఁడు. కాని చోళగుని సైన్యములాతనిని జుట్టుముట్టి కదలనీయక నిల్పివేయుచున్నవి. రాయలుగ్రమూర్తియైనాఁడు. చోళగుని సైన్యమును జించి చెండాడి యెట్టెటో మార్గము నేర్పరచుకొనుచు చోళగుని సమీపించినాఁడు. చోళగుడొక్క వికటాట్టహాసము గావించినాఁడు. రాయలకేదియో స్మృతిపథమునఁ బడినది. ఆతఁడించుక యన్యమనస్కుఁడైనాఁడు. క్షణకాలములోనేఁ "ప్రభూ! సావధానులుకండు; త్రిశూలము." అను తన సైన్యకోలాహలముచే మరల యథాస్థితికి వచ్చినాఁడు. అప్పటికే చోళగుఁడు త్రిశూలమును గురిచేసి రాయలపై విసరినాఁడు. శూలము కనదురు విస్ఫులింగముల నెగజిమ్ముచు, దీర్ఘజ్వాలాభీలమై రఘునాథునివైపు వచ్చుచున్నది. సైన్యమున హాహాకారములు

జనించినవి. ఒండొరులఁ దోసికొనుచు సైనికులు ముందునకు వచ్చుచున్నారు. ఆ భయంకరాయుధమున కాహుతియైనను సరే తమప్రభువును రక్షించుకొనవలెనని సాహసించుచున్నారు. రభసగతి నేతెంచుచు మహావీరులు "ప్రభూ! సాహసమువలదు" అని కేకలిడుచున్నారు. రాయల మోమున చిఱునవ్వు దొంత రలు వెల్లివిరియుచున్నవి. ఆతఁడు తనఖడ్గమును దీసి హృదయ మునఁ దనయేలిక సామియగు శ్రీరామచంద్రుని స్మరించుచు, నా త్రిశూలము నెదుర్కొనినాఁడు. క్షణకాలములో శూలము తుత్తునియలై క్రిందఁబడిపోయినది. చోళగుని ముఖమున వైవ ర్ణ్యముఁ దోఁచినది. ఆతఁడాశ్చర్య చకితుఁడైనాఁడు. వెంటనే వెనుకంజవేసి పలాయనమంత్రము నవలంబింప యత్నించినాఁడు కాని రాయలొక్క యుదుటున వాని యెన్నుపైకి లఘించి, వాని యురమున బెడిదంబగు తనపిడికిటఁ బొడిచినాఁడు. చోళగుఁడు చెక్కుచెదర లేదు. రాయలు తనఖడ్గమును దీసి యొక్కవ్రేటు వేసినాఁడు. చోళగుఁడు చలింపలేదు. ఉపరి "వెంగలిరాజా! నీ శస్త్రబలమును క్షుద్రమానవులపై నుపయోగింపుము. చోళ గుని వజ్రశరీరమును ఛేదించుశక్తి వీనికిలేదు." అని వికటముగ నవ్వుచుఁ బల్కినాఁడు. ఔను. నిజమే. అతని యొడలిపైఁబడి ఖడ్గము ఖణిల్లుమను శబ్దమొనర్చుచు నెగిరి పోవుచున్నది. చోళ గుని శరీరము నిజముగా వజ్రనిర్మితమా ?

రాయల విస్మయమునకు కంతములేదు. ఇరువంకల సైని కులు నీ చిత్రమును దిలకించుచు స్థాణువులవలె నిలిచియుండిరి.

రఘునాథుఁ డాతనిని దనలావుకొలఁదిఁ బొడిచినాఁడు. ఖడ్గరాజముతో బలముకొలఁది గొట్టినాఁడు. కాని ప్రయోజనమిసుమంతయు లేదాయెను. వాని శరీరము కఠిన పాషాణ నిర్మితము. వజ్రతుల్యము. ఇంక వానిని సంహరించుట కలలోని వార్త. విసిగి వేసారి మహాభుజంగమము వోలె బుసకొట్టుచు రాయలట్లే నిలిచిపోయినాడు. క్షణకాలము. అనతిదూరమునుండి "మహారాజా! చోళగుని శిరస్సుపై సుదీర్ఘమగు నొక జడగలదు. అందొక మహౌషధి నిక్షిప్తమైయున్నది. దాని ప్రభావముననే చోళగుఁడు వజ్రకాయుఁడైనాఁడు. దానిని ఖండింపుఁడు. చోళగుఁడువిగతజీవుఁడగును.." అనునొక హెచ్చరిక వినవచ్చెను. రాయలావాక్యము లాలించి యొక్కమారా వంకకు దృష్టి సారించినాఁడు. ఒక యాశ్వికుఁడు సైన్యమధ్యమునుండి బహుప్రయాసముతోఁ దన యశ్వమును నడిపించుకొనుచు నా వంకకే వచ్చుచున్నాఁడు. రఘునాథుఁ డావీరుఁడెవ్వఁడా యని యోజించుచుండగనే "చోళగు డాయాశ్వికునిగాంచి, కన్నుల నిప్పులు గ్రక్కుచు, "నీవా? నీ సాహాయ్యమే లేకున్న నీ క్షుద్రమానవులా నన్ను జంపునది." అని కఠోరముగా నరచి యాతనిపైకి లఘింపబోయినాఁడు. కాని రాయలాతని నదిమి పట్టినాఁడు "రాజేంద్రా! ఆలసింపకుఁడు. సాయంసమయమగుచున్నది. అప్పుడీతని వధియింప మన తరముగాదు" అని యాయోధుఁడు మరల రాయలను హెచ్చరించినాఁడు. రాయలు తన దీర్ఘకరవాలమును దీసి చోళగుని దీర్ఘజటాకలాపమును

ఖండించినాఁడు. చోళగుడు నేలకొరగినాఁడు. రఘునాథుఁడొక్క నిట్టూర్పు విడిచినాఁడు.

"మహాత్మా! మమ్మీ విపత్సముద్రమునుండి యుద్ధరించిన మిమ్మేమని నేనభినందింపగలను. నా శ్రీరామచంద్రుఁడే యీ రూపమున సాక్షాత్కరించి, చోళగాగ్నికి నేమందరము నింధనములగాకుండ రక్షించినాఁడని నా విశ్వాసము." అని రాయలు సబహుమానముగా నా బాలయోధుని బ్రశంసించినాఁడు.

యో :- రాజేంద్రా! లోకకంటకుఁడగు చోళగుని సంహరించిన మీరు సర్వజనస్తవనీయులు. మేమందరమును మీ భృత్యులము. మాకర్తవ్యమునుమాత్రమే మేమునిర్వహించితిమి.

రాయ :- మీరు భృత్యమాత్రులా? ఎంతమాట? మీరిప్పటినుండి నాకు పరమాప్తులు. ప్రాణసమానులు. మీరు నన్నువీడి యెందును బోరాదు. నా సర్వస్వమును మీ యధీనము. మీరు నాకు ప్రాణమిత్రులగా యుండవలయును.

యో :- మహాపురుషా! తృణమును మహామేరువుగాఁ బ్రశంసించుచున్నారు.

రఘు :- అట్లనకుఁడు. ముందు నామైత్రి నంగీకరించి నన్ను ధన్యునిగావింపుఁడు.

యో :- మిమువంటివారి సాహచర్యము, మమువంటివారికి దుర్లభముకదా! అట్టిదయాచితముగ సంభవించునప్పుడు నిరసించునంతటి వెంగలి యుండునా?

రఘు :- ధన్యుఁడను. రండు. మన పటకుటీరమునకుఁ బోవుదము.

యో :- రాజేంద్రా! మీరు సర్వథా కృతకృత్యులు కాలేదు. మీరు నిర్వర్తింపవలసిన కార్యమొండు మిగిలియున్నది.

రఘు :- ఏమది ?

యో :- మీరెండవ ప్రతిజ్ఞను విస్మరించితిరా ?

రఘు :- లేదు, కాని సింహళేశ్వరుని జాడ రవంతయును దెలియలేదు.

యో :- ఆతఁడిందే కారాగారమున బంధింపబడి యున్నాఁడు.

రాయల యాశ్చర్యమునకు మేర లేదు. ఆతని కనుదమ్ము లానందాశ్రుపూర్ణములైనవి. ఆతని హృదయము పొంగినది. ఆతని నెమ్మొగము ప్రమోదచంద్రికా వికసితమై, ప్రణయసౌర భముల వెదజల్లినది.

రఘు :- ఎట్లు ? నా ప్రాణసఖుఁడు సింహళేశ్వరుఁ డిందే కారాగారమున నిడుములు పడుచున్నాఁడా! మిత్రమా ! రండు. ఆలసింపక నాకాస్థలమును జూపుడు.

వారిద్దరు కారాగారమువైపు నడువసాగిరి. వారివెంబ డినే సైన్యాధిపతులును నడచిరి. ఇంక పలుమాటలేల ? తన బాల్యసఖుని కారాగారమునుండి విడిపించి రఘునాథుఁడు సర్వథా కృతకృత్యుఁడైనాఁడు.

## ప ద వ ప్ర క ర ణ ము.

మాటిమాటికి యుద్ధములనే వర్ణించుచు మాచదువరు లకు విసువు కల్గించుట మామతముకాదు. కావునసంక్షేపముగఁ దరువాతి కథ చెప్పెదము. చోళగసంహారానంతరము రాయలు విశ్రాంతియైనఁ దీసికొనలేదు. మరునాడే, ససైన్యముగ సముద్ర తరణము గావించుటకు వలయు సన్నాహములు గావింప నాజ్ఞా పించినాఁడు. ఈమారు కూడ పడవల వంతెనపైనే సైన్యము సముద్రమునుదాటి సింహళతీరమును జేరినది. రాయలు యథా ప్రకారముగఁదన విజయగరుడాద్రి నధిరోహించియే పారావార మును దరించినాఁడు. వెంటనే హుటాహుటిఁబయనము సాగించి జాఫ్నాకోటను ముట్టడించినాఁడు. దరికేతెంచిన సైన్యముపై బుడతకీచుల ఫిరంగులు పనిచేసినవికావు. అకోటయు శత్రుదుర్భే ధ్యమైనది కాదు. కావున రాయలసైన్యమనాయాసముగ నందుఁ బ్రవేశించినది. చేయునదిలేక పోర్చుగీసువారు పలాయన మంత్ర మవలంబించిరి. కన్నబిడ్డలను, గాదిలియిల్లాండ్రను, అష్టకష్టముల కోర్చి యార్జించిన ధనరాసులనుగూడవీడి, పాపము బుడతగీచు లోడలపైనెక్కి పారిపోయిరి. రాయలచ్చటనే సింహళేంద్రుని పునః ప్రతిష్ఠితునిగావించి, యందొక దినముమాత్రమే సింహ ళాధిపతి కోర్కెపై వసియించి, యనంతరము సముద్రమును యథాపూర్వముగనే తరియించి, నిరంతర ప్రయాణములతో పలవానేరికేతెంచి, యందు విడిసెను. అచ్చటికరక్రోసు దూర ములోనే జగ్గరాజాదులు ససైన్యముగ విడిసియుండిరి.

మరునాఁడు ప్రొద్దుపొడువక పూర్వమే రాయలు మేల్కొంచి, సుస్నాతుఁడై శ్రీరామ పూజాది నిత్యకృత్యములు నిర్వర్తించి, శ్రీమూర్తి దానాద్యశేషదానములు గావించి, శ్రీవైష్ణవులొసంగిన యక్షతలను శిరమునదాల్చి, యాదిత్య హృదయమును నిష్ఠ జపించి, యైదారు ఘడియల ప్రొద్దెక్కినంతనే యారగించి. రణభేరి మ్రోగింప నాజ్ఞాపించెను. అటు జగ్గరాజాదులుగూడ రణభేరి మ్రోగించి, యుద్ధసన్నద్ధులైరి. ఇరువాగుల సైన్యములను దోపూరుపద్ద నొండొంటి నెదుర్కొనినవి. హయహేష నము, మదగజ ఘీంకృతులును, పోటుబంటుల వీరాలాపములు మిన్నుముట్టుచుండెను. ప్రళయకాలమున నుత్తుంగతరంగ ఘములతో నాభీలములగు మహాసముద్రము లొండొంటి దుర్కొనుచున్నట్లామహా సైన్యములు రెండు నొండొంటి నెదుర్కొనినవి. పోరు ఘోరముగ జరుగుచుండెను. ఒకవంక ఫిరంగులు గుభిల్లుగుభిల్లుమను శబ్దములతో నగ్నిగోళముల వర్షిం చుచుండెను. ఒక వంక తుపాకులు పతిల్లు పెతిల్లుమని పేలుచు ను. ఒకవంక కరవాలముల ఖణాఖణార్భటులు వినవచ్చు ను. ఒక వంక జివ్వుమను శబ్దముతో నీటెలెగురుచుండెను క్త మేరులై పారుచుండెను.

నాటి యుద్ధ రఘునాథరాయలు మధ్యందిన మార్తాండుని వోలె రీక్ష్యుఁడైయుండెను. ధవళంబగు నొక జవనాశ్వమునధిరోహి , వజ్రసన్నిభమగు కరవాలమును గిరి గిర ద్రిప్పుచు, నాత దినమున నాహవరంగమున వీరవిహారము గావించుచుండె. ఆతని నెదుర్కొనినవారెల్ల వీరస్వర్గ

మలంకరించుచుండిరి. అతని కరకుకరవాలమునకెరయై, తాటి పుచ్చెలవలె, మస్తిష్కము లెగిరిపడు చుండెను. ఆతఁడాదిన మున నందరి కన్నిరూపులై, విశ్వసంహారమును గావింప విజృంభించిన విరూపాక్షుని దలంపునకు దెచ్చుచుండెను. రుధిరధారాసిక్తమగు నాతనిశరీరము, జాజ్వల్యమానకీలికీలాకలాపము భంగి భయదమై యుండెను. ఇట్లుసమసమరమునంబ్రళయతాండవము గావించుచున్న రఘునాథునకనతిదూరమున గొబ్బూరి జగ్గరాజు కానుపించెను. ఒక్క యుదుటున నాకొన్నబెబ్బులివోలె రఘునాథుఁడాతనిపైఁబడి యొక్కవ్రేటున నాతని శిరమును నేలఁగూల్చెను. జగ్గరాజహతకుఁడు మరణించినంతనే, యాతని సేనలు చెదరి పారజొచ్చెను. చేయునదిలేక ముత్తువీరప్ప కదనరంగము నుండి పలాయితుఁడాయెను. పాపము కృష్ణభూపతి యొంటిగా నాయాహవరంగమున నుండెను. ఆతని యేన్గునునడిపించు మావటి యొకవీరుని కరకు భల్లమునకెరయైనాఁడు. శత్రుసేనలు చెల్లాచెదరై పారిపోవుచున్న యా సమయమున నాతనికి మావటియెుక్కడ లభించును ? స్వయముగా నా మదగజమును నడిపించుకొను శక్తి యాతనికిలేదు. క్రిందకురికి పారిపోవుట కాతని కాలుసేయాడుటలేదు. పాపమాతఁడందే, యుండి బెదరి బెదరి యిటు నటు బరికించుచుండెను. పారిపోవుచున్నముత్తువీరప్పను భటులు పట్టితెచ్చి రాయల కప్పగించిరి. వీరపనీఁడధోముఖుఁడై రాయల మ్రోలనిలిచి యుండెను. రాయలమోము క్రోధఘూర్ణితమై రక్తచందనమలందినట్లు జ్వాలమైగన్పట్టెను. వీరపనీఁడు భీరువుకాకపోయినను మహావీరుల తెగలో మాత్రముచేరఁడు.

ఆతనికసువులన్న దీపిమెండు. రాయల పాదములపై శరణు శరణని యాతఁడు వ్రాలవలసినదే కాని యందులకాతని రాచ ఱికె మడ్డు వచ్చినది. ఆతఁడు ప్రాణభయముచే గజగజ వడకుచుండెను. సిగ్గుచే వెలవెల పోవుచుండెను. తన్ను రక్షింప మనస్సులో వేయిదైవములకు మ్రొక్కుచుండెను. రాయలాతని పైపాకనిశితవీక్షణమునుబరపి, యనంతరము సచివసామంతదం డనాథాదులవైపు తన చూడ్కులు మరలించినాఁడు. ఈ ద్రోహికి మీరువిధించు శిక్షయెద్ది? అనియాచూ డ్కులభావము. మరియు వీరపనీని దీవ్రదృక్కులనవలోకించుచు దండనాథాదుల నుద్దేశించి రాయలిట్లు పలికినాఁడు.

రాయ:- ఈతఁడు జగత్కంటకుఁడగు చోళగునకుఁ జేదోడు వాదోడుగఁబనిసేసి, జగద్ద్రోహియైనాఁడు. మహాపాపి యగు జగ్గరాజున కండయైనిలిచి సామ్రాజ్యము నెడ ద్రోహియై చరించినాఁడు. శ్రీరంగరాజాదులఁ హత్యగావింప బ్రోత్స హించిన మహాపాపి. ఈతనికి మీరెట్టిశిక్షవిధింతురో, చెప్పుడు.

దండ:- ఈజగద్ద్రోహికి కఠినమరణదండనమే విధింప నగును. కుక్కలచేఁగరపించిగాని, నిశితాయుధములచేఁబొడి పించిగాని, యీతని నంతమొందింపనగును.

దండనాథాదుల వాక్యములింకను ముగియలేదు. చుక్క తెగిపడునట్లొక యాశ్వికుఁడా ప్రదేశమునకే హుటాహుటివచ్చి రాయల పాదపద్మములపై వ్రాలినాఁడు. ఆతని గాంచినంతనే రాయల ముఖమండలము ప్రసన్నమైనది. ఎవ్వరాతఁడు ? పాఠ

కమహాశయా! ఆతఁడే చోళగ రహస్యమును రాయలకెఱింగించిన బాలయోధుఁడు. కావుననే, అట్టివిషమ సమయమునఁగూడ రాయలమోము ప్రసన్నాకృతి వహించినది. రాయలాతని నర్ధాసనా సీనుని గావించి "మిత్రమా? ఏమిది? నీమోము దిమ్మవివర్ణమైయున్న దేల? ఎద్దియైన నాపద సంభవించినదా? మరియు, ప్రాణసముడవగు నీవు నాపాదములపైవ్రాలుట నాకు లజ్జాకారణముకదా! నావలన నీకెద్దియైన సాహాయ్యము కావలయునా? కోరికొనుము. నీకోర్కె యెట్టిదైనను రఘునాథుఁడు దీర్పుటకు సంసిద్ధుఁడై యున్నాఁడు."

బాల. యో:- కృపానిధీ! నాకోర్కె వినినంతనే, నాపై మీకుగల సద్భావమంతరించునని నే నెఱుంగుదును. కాని యిందు నాకు మార్గాంతరములేదు. కావున నాప్రార్థనమెట్టిదైనను మీరునన్ను మన్నింపవలయును.

రాయలు:- (చిఱునవ్వుతో) మిత్రమా! ఇంతసందియ మేల? ఒకనాడు నీవు మమ్మువ్మృత్యుముఖమునుండి కాపాడితివి. ఆయుపకృతి సామాన్యమైనదా? దానిని మేముమఱచితిమను కొంటివా? తప్పక కోరికొనుము. రఘునాథుఁడు తనప్రాణముల నైన నర్పింప సంసిద్ధుఁడై యున్నాఁడు.

సచివసామంత దండనాథాదులు సంభ్రమాకులితమన స్కులై యావత్సంగము నాలించుచుండిరి. ఆబాలయోధుని కోర్కెయేమైయుండును? కొంపదీసి, రాయలప్రాణములనే కోరదుకదా! అని వారిలోవారే గుసగుసలాడుచుండిరి. బాల

యోధుని గాంచినంతనే వీరపనీడును విస్మయపరీతచేతస్కుడై నాడు. మరియుదైన్యము దోపనాతని వంకకే చూచుచున్నాడు.

బాలయోధు :- మహావీరా! నాపై మీదయగలదేని, మీ యెదుట నిలిచియున్న జగద్ద్రోహియగు నీ 'వీరపనాయని విడిచిపుచ్చుడు.

రాయలు తుళ్ళిపడినాడు. సచివసామంతాదు లదరి పడిరి. సైనికులలో గోలాహల ముదయించినది. వీ ర ప నీ డు మాత్రము నిశ్చలుడై యట్లే నిలిచియున్నాడు.

రాయలు :- ఇదియేమి కోర్కె. వీడు మహాపాపి; సమాత్రుని హత్యగావించిన కిరాతకుడు. లోక కంటకుడగు చోళగుని కుడిభుజము. వీనివిడుచుట రాచపాడియా ? జగత్కల్యాణము నాశించి చెప్పుచున్నాను. ఈ విపరీతపు గోర్కె మానుము. ఇంకెద్దియైనం గోరుకొనుము.

బాల యో :- మహాశయా ! ఈతనిగూర్చి మీరు పల్కిన దంతయు సత్యమే. నేను నీతియెఱుంగక మిమ్మిట్లర్థించితి ననుకొను చున్నారా ? వీని దౌర్మార్గ్యమునకు మరణదండనమే యుచితదండన మనియు నేనెఱుంగుదును.

రాయలు :- అన్నియుం దెలిసియుండియు, నీ జగత్కంటకుని రక్షింప యత్నించుటకుంగల కారణమేమో మేము విన వచ్చునా ?

బాల యో :— రాజా! కారణములేకుండ నేనాఁడు గూడ నేకార్యమునాచరింప యత్నింపఁడను నాకీర్తిని మీరు వినలేదా? తగినంత కారణము కలదు కావుననే, ఈతనికి ప్రాణభిక్ష నిడుడని నే నర్థించుచున్నాను. కాని యాకారణ మెద్దియో చెప్పుటకిప్పుడు వలనుపడదు. సకాలముననే మీకది తెలియఁగలదు. అది సిగ్గుపడవలసిన విషయము మాత్రము కాదని నేను మనవి చేసికొనుచున్నాను. ఇంక నే చెప్పవలసిన దేమియును లేదు. మీ యిచ్చవచ్చినట్లే కావింపనగును.

రాయలు :— మిత్రమా! కోపమువలదు. వీఁడు లోక కంటకుఁడగుటచే నింతదనుక వచించితిని. కాని యీఁడీ తప్పునుద్దేశముతో గాదు. ఇదిగో నీకోర్కె ననుసరించి, వీరపనాయని విడిచిపెట్టుచున్నాము.

ఇట్లు వీరు మాటలాడుకొనుచుండఁగాఁ గొందఱుభటులు కృష్ణభూపతిని బట్టి తెచ్చుచుండిరి. అతఁడేడ్చుచున్నాఁడు. మొత్తుకొనుచున్నాఁడు. భటుల పాదములపైఁ వ్రాలి బతిమాలుకొనుచున్నాఁడు. "నేను నాజన్మలోఁ గత్తిపట్టి యెఱుఁగను. ఇట్టి నేనెవ్వరిని జంపగలను? నన్ను నిష్కారణముగా బంధించినారు." అని మొరపెట్టుచున్నాఁడు. కాని యప్పుడాతని మొర నెవ్వరాలకింతురు. భటులాతనిని రాయలకడ కీడ్చి తెచ్చిరి. రాయలను జూచినంతనే యాతఁడు బాలునివలె రోదించుచు నాతని పాదములపై వ్రాలి "శరణు శరణు మహారాజా! రక్షింపుము. ఇఁక నెన్నఁడు నిట్టి యకృత్యము లాచరింపనని యిదిగో

లెంపలు వాయించుకొను చున్నాను." అని యెలుగెత్తి యఱచుచు రెండుచేతులతో లెంపలు వాయించుకొన సాగినాడు. రాయల కాతనియెడ నెక్కడలేని హేయభావమును గల్గినది. కరుణయుఁ గల్గినది. కొందరాతనినిజూచి లోలోన నవ్వుకొనిరి. రాయలందరి దిక్కు మొగంబై, "నా కులదైవతము, నా ప్రాణమునకుఁ బ్రాణము, నన్ను సదా మనుచునేత, నా శ్రీరామ చంద్రుఁడు శరణాగత త్రాణపరాయణుఁడు" అని పల్కినాఁడు. "ఈతని విడిచిపెట్టుట యే భావ్యము. పశ్చాత్తప్తుఁడు" అని దండనాథాదు లేకగ్రీవముగ పల్కిరి. "తంజాపురీ ప్రభువులు ధర్మరహస్యము నెఱింగిన మేటిపేరులు" అని బాలయోధుఁ డుచ్చైస్స్వరమునఁ బల్కినాఁడు. కృష్ణభూపతి యంతవరకుఁ దన గోలలోనే యున్నాడు. బాలయోధుని కంఠస్వరమును విని నంతనే తుల్లిపడి, యాతని దిక్కు మొగంబై తేరి పారజూచినాఁడు. అంతట రాయలాతనితో "అట్లు చూచెద రేమి? ఆతఁడు నా ప్రాణసఖుఁడు. చోళగ సంహారమప్పుడు మా ప్రాణమును గాపాడిన దయాశాలి. ఈతనిని మీ రెక్కడనో చూచినట్లున్న దే మీ ముఖ విలాసము?" అని పల్కినాఁడు. బాలవీరుడు మోము దించుకొని యున్నాఁడు.

కృష్ణ :- అయ్యో! ఎఱుఁగ కేమి? ఈతనిని మీ కంటె బాగుగా నెఱుఁగుదును.

రాయల యాశ్చర్యము మిన్నుముట్టెను. ఆ బాల యోధుఁ డెవ్వరో తెలిసికొనవలెనను కుతూహలము, ఆతని నుచితరీతి సంభావింపవలెనను తీవ్రవాంఛ, కృష్ణభూపత్యాదు

లకు నాతనికిగల సంబంధమెట్టిది యను ప్రబలసందేహము రాయల హృదయము నొక్కమారే ముప్పిరిగొని యాక్రమించెను.

రాయలు :- (ఆతురతతో) మీకు తెలియునా? అయిన నీతఁడెవ్వరో, త్వరగాఁ జెప్పదరా సామీ!

కృష్ణ :- ఈతఁడెవ్వరు? ఈమె.

రాయ లొక్కమా రాశ్చర్య చకితుఁడై యదరిపడినాఁడు. అచ్చటనున్న వారందరు 'ఆఁ ఏమి? స్త్రీయా?, అని యుచ్చైస్స్వనమున నరచిరి. కొందరు కృష్ణభూపతికి మతి చలించినదను కొనిరి. కొందరందేమి రహస్యమున్నదో తుదవరకు విని మరియు నిశ్చయింపవలెనను చుండిరి. కొందరా ప్రసంగమంతయు వట్టి భ్రాంతియేమో అను భావనకు లోనగుచుండిరి. కృష్ణభూపతి మరల నందుకొనినాఁడు.

కృష్ణ:-రఘునాథా! యోధవేషముననున్న వ్యక్తి ఈమెయేకాని యీతఁడుకాఁడు. మీరీమె కనేకవిధముల ఋణపడియున్నారు. అందు ముఖ్యముగ నీవు మొట్టమొదట చిద్ఘనానందుల యాశ్రమమున నీమెను జూచితివి. చిద్ఘనానందులనగా నెవ్వరో మహాయోగి యనుకొనవలదు. ఆతఁడే మాయావియగు చోళగుఁడు. అతఁడు విషమొసంగి నిన్ను జంపయత్నించినాఁడు. నీకు దైవబలము కలదు. కావుననే యా సమయమున కీమెయు నందేయుండుట తటస్థించినది. వానిదురూహాలీమెకు బాగుగాఁ దెలియును. వేయేల వాని సర్వరహస్యములు

నీమెకు దెలియును. కావునసే యాతని యాతిథ్యము నెంత మాత్రమును స్వీకరింపచలదని సన్నిమె నివారించినది.

రాయలు :- ఏమి? చిద్ఘనానంము లే చోళగుఁడా. ఆత నిని నేనును సందేహించితిని, కాని యాతఁడే చోళగుఁడను నూహా నాకు గలుగలేదు. చోళగునకు నాతని కెద్దియేని సంబంధముండునని కొంటిని. అప్పుడు నా ప్రాణముల గాపాడిన దీమెయా ?

కృష్ణ :- అంతమాత్రమేనా ? ఈమెయే మీాకండగా నిలిచియుండనిచో మీారు మమ్ము సాధించియుందురా ? మా సర్వప్రయత్నములు నీమె మూలముననే విధ్వంసములైనవి. యాచమనాయనింగారిని, రామరాయలను, అటవీ మార్గమున రక్షించిన దెవ్వరు? ఈమెయే. యాచమనాయని నడ్డగించిన వారు దొంగలు కానేకారు. వారు మేమంపిన సైనికులు. ఈమె యే లేకున్నచో నా రహస్యము బ్రహ్మకు దెలిసియుండెడిది కాదు. మరియు చోళగుని సర్వరహస్యములును నీ కెఱింగించిన దీమెయేకదా ! కాకున్న నాతని త్రిశూలము నెదుర్కొన మానవ మాత్రులకు సాధ్యమగు విషయమా?

రాయ:- (అచ్చెరువుతో) ఎంతయచ్చెరువు. యాచమ నాయనింగారి నీమెయేనా మధ్యమార్గమున రక్షించినది? చోళగ త్రిశూల రహస్యము నీమెయే నాకెఱింగించినది? చోద్యముగనున్నదే. మహాశయా! దైవమునలె మమ్మున్ని యాపదలనుండి యుద్ధరించిన యీయమ్మ రాలెవ్వరో తెల్పెదరా ?

కృష్ణ:- ఇంకదాపరిక మేల? ఈమె వీరపనాయని యనుంగు సోదరి, మధురాంబిక.

బాలనీకుని మోము సిగ్గుచే నెఱ్ఱనడిలేగులాబుల పూచి నది. మోముదమ్మిపై చిఱుచెమ్మటలుపోసి ముత్యాల కాంతుల నీనుచున్నవి. లజ్జాభరముచే నించుక వాలియున్న యామెకను దోయి, దరవికస్వరపద్మశ్రీని వహించినది. అప్పుడామెను సురమోహనమూర్తి, యమలమై యతిలోకసుందరమై, చూపట్టి నది. ఉచ్ఛ్వాసనిశ్వాసములనుగూడ బిగబట్టి, యందరు నాతరత తోనేమి జరుగు నాయని చూచుచుండిరి. అంతవరకు మూగ వలె నిలిచియున్న వీరపనీడు ముందు కేతెంచినాఁడు.

వీరపనీడు:-. రఘునాథా! నీవు మాయందరికంటె వయ స్సున జిన్నవాడవయ్యు, బుద్ధిచే, ధర్మతత్పరత్వముచే నధి కుఁడవు. మరియు నిప్పుడే మాకు ప్రాణదానము గావించితివి. నీకు మేమనేకవిధములఋణపడి యున్నాము. ప్రాప్తకాముఁడ వగు నీకు మేమేమి యుపాయన మీయగలము? ఇదిగో యీ యమూల్య రత్నమును నీకొసంగుచున్నాను, పరిగ్రహింపుము. (మధురాంబికను జూపుచు) ఈమెనీకు సర్వథా తగియున్నది వయోరూపములందును, ధర్మతత్పరత్వమునందును, వీరవ్రతము నందును, ఈమె నీకెందునుదీసిపోదు. మరియుఁజిన్ననాటినుండి యు నిన్నుఁబ్రేమించినది. ఈనాటి కనురూపవయోగుణ సమన్వి తులగు దంపతులనుగూర్చి, విధాతచరితార్థుఁడైనాఁడు. (అని యామెపాణిని గ్రహించి రఘునాథుని చేతిలో నుంచినాఁడు.)

అచ్చటనున్న వారందరు హర్షధ్వనులు గావించి, సమయోచితముగఁ బ్రవర్తించిన వీరపనాయని బ్రశంసించిరి.

రఘునాథుఁడా యుద్ధరంగముననే రామరాయలను సామ్రాజ్యాభిషిక్తుని గావించినాఁడు. పాండ్యతుండీర విభులు నాయుత్సవమునఁ బాల్గొనిరి. అనంతరము విజయ దుందుభులు మ్రోగుచుండగా, రాయలు పురాభిముఖుఁడైనాఁడు.

---

## పదునొకండవ ప్రకరణము.

నాఁడు తంజాపురము కన్నులపండువుగా నలంకరింపఁబడి యుండెను. పురవీథుల మృగనాభిపంకముతోఁ గలయంపి జల్లినారు. కలువడంబులు గట్టినారు. కపురంపు టనఁటికంబములు నాటినారు. ముత్యాలరంగ వల్లులు దిద్దినారు. సుధాధవళితంబులగు కుడ్యభాగంబులపైఁ జిత్రవిచిత్రములగు చిత్తరువులు చిత్రించినారు. ఆకసమ్మునంటు కోటబురుజులపై నరుణారుణములగు కాంతులఁ జిమ్ముచు, మందపవమాన సంచలితమ్ములగు కేతనములనేకము లెగురుచున్నవి. గుడిగోపురములపైఁ జెక్కఁబడిన శిలావిగ్రహములు వివిధవర్ణోపేతములై బాలభానుని కిరణ జాలములో మిలమిల మెరసిపోవుచున్నవి. దేవతాయతనములలో నిరంతరముగ ఘంటా నినాదములు వినవచ్చుచున్నవి. సిగలలో సంపెగ పూవులు తురిమి, మోమునఁ గమ్మకస్తురి నామములను దిద్ది, గలగలలాడు క్రొంబట్టు పుట్టములతో, మిల

మిలలాడు జలతారు వలెవాటులతో, తళతళలాడు తారహార ములతో, సంపన్నులగు యువజనులు రాజవీథుల రాయస ముట్టిపడగా నడచుచుండిరి. మేడలపై మిద్దెలపై శృంగార వతులు, బంగారు తీగెలవోలె నిలిచి, పత్తనసౌభాగ్యమునవలో కించుచుండిరి. గమగమ వాసనలు వెదజల్లు మల్లెలు, మొల్లలు, విరజాజులు, సంపెగలు, లేగులాబులు, రాసులుగఁబోసికొని కలు వరాచప్పరములపై నాసీనలై పుష్పలావికలు పురవీథులఁబచా రులుసేయు విటజనముతో నర్మగర్భసల్లాపము సేయుచుండిరి. బాలురు కేకలిడుచు నటునిటుఁబర్వులు వెట్టుచుండిరి. బజారు లలో నత్తరువుల సెత్తావులుగుబాళించుచున్నవి. హాసధ్వనులతో నట్టహాసములతోఁ జతురవచోరచనలతో సరససంగీతకలస్వనము లతో, నగరమంతయు మార్మ్రోగుచుండెను. ఏందులకీ యానం దము ? ఎందులకీ యాడంబరము ? ఓహో! తెలిసినది. రఘు నాథరాయలవారానాడు విజయలక్ష్మీ సమేతులై పురప్రవే శమును గావింతురు. అందులకే యీ యానందము. అందులకే యీ యాడంబరము.

రాయలవారి యాగమనమును సూచించుచు నగరబహిః ప్రాకారముపై రెండు ఫిరంగులు ప్రేలినవి. పత్తనమున జన కోలాహల మతిశయించినది. పురవీథులన్నియుఁ గిటకిట లాడు చున్నవి. తండోపతండములుగ జనులందరు సప్తమప్రాకారము వంకకే చనుచుండిరి. కోటలోనుండియు నెదురుకోలు సన్నాహ ముతోఁ గొందరు మహాజనులు బయలుదేరిరి. మహామంత్రులు గోవింద దీక్షితులవారు, యాచమనాయనింగారు, యజ్ఞనారా

యణదీక్షితులు, వేంకటమఖి మున్నగువారందు ముఖ్యులు. రామభద్రాంబ, మధురవాణి, మున్నగువిదుషీమణులును నా యెదురేఁగులు సన్నాహములోఁ బాల్గొనిరి. పూర్ణకుంభముల తోఁబుణ్యపురంధ్రులు ముందు నడచుచుండిరి. వారికిరుపంకలఁ జలన్నూపురఝళంఝళారవములతో వారాంగనలు మందమంద గతులఁబోవుచుండిరి. ఒకవంకనుచ్చైస్స్వరమున వేదాశీర్ఘోషములు వినవచ్చుచుండెను. ఒకవంక భేరీపటహాది నానావిధ వాద్య ధ్వనులు మిన్ను ముట్టుచుండెను. ఒకవంక వేణువీణాదికలక్వాణ ములు, కర్ణపుటములసమ్మృతమునుజిలుకరించుచుండెను. ఒక వంక గాణిక్య మనోజ్ఞ నృత్తగానంబులు మురిపెమ్ములు గులుకు చుండెను. కొందరు ముత్యాల గొడుగులుబట్టి ముందు నడచు చుండిరి. కొందరు పట్టుపింఛములు పట్టుకొనియుండిరి. కొందరు చాదుదివిటీలు కేల గీలించిరి, కొందరు మణిమయంబులగు మకర తోరణములు మోయుచుండిరి. ఒకయెడ నేరువుదివిటీలు మిల మిలమెరయుచుండెను. ఒకచోట కంచు వెండి బంగారు కైదివిటీలు వెలుగుచుండెను. ఒకవంక 'రాణగల బాణవిద్యలు దండుగా నిండియుండెను.' ఒకచాయఁబెరుగల దీపముల తేరులు నయన పర్వముగ నుండెను. ఒక కేవ 'భూచక్ర గొడుగులు నొక చెంత సౌవర్ణ రాజతచ్ఛత్రచామర ధ్వజవ్యజనాదులునుఁ బ్రకాశించుచుండెను. ఒకదారి, 'పొగలేని పగలు వత్తులు మిన్నగా వెన్నెలలు గాయుచుండెను. ఒకప్రక్క 'రావణకుంభ కర్ణ వాలి సుగ్రీవ హనుమదాది భావములమించు దీపప్రతి

మలును, గోవర్ధనోద్ధరణ గోపికా వస్త్రాపహరణ భావప్రతిమ లును, విరాజిల్లుచుండెను.

ఇట్లు నయనానంద దాయకంబైన యుత్సవములో, గోవిందయజ్వాదులు విజయలక్ష్మీ సమపేతుఁడగు రఘునాథు నెదుర్కొనిరి. ఓహో! ఏమి యీ సింగారపు హొయలు? చూచుటకు రెండు కన్నులు చాలవు, వర్ణించుటకొక్క నాలుక చాలదు. ఆతఁడానాఁడు రంగారు బంగారు చుంగులచే మిటా రించు, మేల్మి పసిండి పట్టుపుట్టమును గటిగట్టినాఁడు. సరిగె ముత్యాల చకచకద్యుతులచే నింపులు గుల్కు పయిఱెవియుర చట్టిదొడిగినాఁడు. కలికి పచ్చల తురాయితో గలకలలాడు ముత్యాల కుళ్ళాయిని శిరమునబూని యోరగాముడిచిన సిగపై సంపెంగపూవుల సరములుదాల్చి, నిద్దంపుజెక్కుటద్దంబుల నీడలు దేరఁ బెద్దచౌకట్లులు ప్రియమారఁబూని, మేనఁగుంకుమాంగ రాగంబు గుబాళింప, వీనుల మవ్వంపు జవ్వాదిని నించి నాఁడు. కంటసరంబును గంఠమాలికలను, బచ్చలపదకంబును, బవిరిచెక్కడంపు బనివాడితనముగల ముత్యాలతాళియు నెదపై నమర్చి శాత్రవకంఠలుంఠన ప్రశస్తములగు హస్తముల వజ్రాల చేసరులు, కెంపుల కడియాలు, నవరత్నస్థగితములగు బాహు పురులును ధరియించి, యకలంక నూత్న రత్నాంగుళీయకముల నంగుళులపై హరువు మెఱయ నమర్చినాఁడు. వైరులతల మెట్టు వామపాదంబున బిరుదైన గండపెండారమును సవరించి నాఁడు. ఇట్లు కోటికందర్ప సుందరాకారుఁడై యేతెంచు రాయ లను గన్నులారఁగాంచి యానాడు ప్రజలందరు నానందాంబుధి

నోలలాడిరి. కొందరు భక్తివినమ్రులై పునఃపునః ప్రణామములు సేయుచుండిరి. కొందరు హర్షపులకిత గాత్రులై యాడుచుఁ బాడుచు గంతులువేయుచుండిరి. కొందరు తదేక మనస్కులై, తమహృదయార విందముల నామన్మథ మన్మథునే ప్రతిష్ఠించు కొని, యారాధించుచుండిరి. కొందరు జయజయ ధ్వానములు సేయుచుండిరి. కొందరు బరాబరులు సెప్పుచుండిరి. వందిమాగధులు హృద్ధ్యాన వద్యవద్య గీతంబుల రాయలను దద్వంశము గీర్తించుచుండిరి. వారాంగనలు నృత్తగీతముల నలరించుచుండిరి.

గోవిందయజ్వను యాచమనాయసింగారిని గాంచినంతనే రఘునాథుఁడు పట్టపేన్గునుండి దిగి వారిదరి కేగి, యభివాదన మొనర్చినాఁడు. హర్షాశ్రువులు జాలువార, వారాతని నాశీర్వదించి, బిగియార గాగిలించుకొని యమందానానందము నందిరి. అనంతరము వేదాశీర్ఘోషంబులు సెలంగ, విప్రపుంగవులు హరితాక్షతలు జల్లిరి. కన్యకామణులు కపురంపుటారతులు పట్టిరి. పుణ్యాంగనాజనము సేసలుజల్లిరి. వృద్ధపురంధ్రీమణులు, పుష్పహారముల నలంకరించిరి. అంత రాయలు తన పట్టపేన్గు నధిరోహించెను. గోవిందయజ్వాదులును, మదగజముల నధిరోహించిరి. ముందర చతురంగబలములును నడచు చుండెను. భేరీమృదంగ పణవ పటహ మురళ ఢక్కాహుడుక్కాది వాద్యధ్వనులు దిక్కటాహంబులు పిక్కటిల్ల మ్రోగు చుండెను. రాజులును గైజీతపు పౌజులును, ఎన్నికగన్న

మన్నెదొరలును, అసమాన సాహస సమన్వితులగు హాసము వారును, నవ్వేంద్ర్యులగు విద్వత్కవులును, నటచేట పీఠమర్ద విదూషకాదులును వెన్వెంటనే తీవి మెరయ నొయ్యారంబు మీర నడచుచుండిరి. ఇట్లనన్య సామాన్య వైభవోపేతుండై రాయలు నగరు ప్రవేశించెను.

అచ్యుతరాయల వారాదినమున శ్రీరంగము నుండి విచ్చేసి నిండుకొలువుండి ప్రియపుత్త్రిసి రాకకై యెదురుసూచు చుండిరి. ఆనాడిందిరా మందిరము నిగమాగమ విదులగు విప్రులచేతను, షడ్దర్శనీపారగులగు పండిత ప్రకాండులచేతను కర్ణాట కాంధ్రద్రమిళ ప్రబంధ నిర్మాణ నిపుణులగు కవితల్లజులచేతను సరస సంగీతకలా ప్రవీణులచేతను గిటగిటలాడుచు మహోజ్వల వైభవోపేతమై యుండెను. కొలువుకూటమునకు దవుదవ్వులనే రఘునాథుఁడు పట్టపేన్గునుండి దిగి, పాదచారియై యచ్యుత రాయలవారి సమ్ముఖమున కేతెంచి, తత్పాదారవిందములకు భక్తిపూర్వకముగఁబ్రణమిల్లెను. ఆ సమయమున నాతండ్రియను భవించిన యానందమును వర్ణింప మాతరముగాదు. వీరాధివీరుఁడును సద్గుణఖనియునగు నట్టి పుత్త్రినిగాంచిన యా తండ్రి జన్మయే ధన్యము. అతని జీవితమే సార్థకము. ఆనందాశ్రువులు జాలువారుచుండగా నాయన సింహాసనమునుండి లేచి హర్ష గద్గదమగు కంఠస్వరముతో నాతని నాశీర్వదించి, బిగియార గౌగిలించుకొని, మూర్ధాఘ్రాణమును గావించి తన యరాస

నమున సుఖాసీనుని గావించెను. అంతట రామభద్రాంబ లేచి యీక్రింది పద్యము నాశువుగాఁ జెప్పెను.

"వేరీ నీసరి రాజులు
భూరమణులు నిన్ను జాల బొగడుదురు భళీ
సార్వరాజని రేరాజని
రారాజని యచ్యుతేంద్ర రఘునాథ నృపా"

అందరు హర్షధ్వనులు గావించిరి.

అంతట మహామంత్రులు లేచి, మరునాడే ప్రశస్తమగు ముహూర్తము గలదనియు, నందు మధురాంబా రఘునాథుల వివాహమహోత్సవము జరుపఁబడుననియు సభ్యుల కెఱుకపఱచిరి. అనంతరము హర్షధ్వనులతో సభ ముగిసెను.

